ప్రకృతి సౌందర్యము నడుమ

సౌందర్యవతులు

ముద్రింపబడిన, రంగు, సిల్కు




ధరించినవారు స్వదేశీ వస్త్రములనే కొనుదు
మంచిరకమునే కొనుదు






### చాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్థసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంథికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

వ్యవస్థాపకులు :

డాక్టరు కే. యన్. కేసరి

# గృహలక్ష్మి

విజ్ఞాన వినోద ఆరోగ్య సౌభాగ్యములను
పెంపొందించుటకు ఏర్పడిన స్త్రీల
సచిత్ర మాస పత్రిక

ఆక్టింగ్ ఎడిటర్ :

సి. సి. పున్నయ్య

సంపుటము 23]   జూన్ 1954   [సంచిక 6

# విషయసూచిక







శ్రీ కేసరిగారు కడసారి స్వయంగా స్వర్ణకంకణ ప్రదానము చేసినప్పటి చిత్రము




జయజయ గృహలక్ష్మీ సఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతిమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!



---

## మృతవార్షిక వర్ధంతి

బ్రతికి యున్నంతకాలం రోజులు దొర్లిపోవడం అంతగా లెక్కకురావు; కాని చనిపోయిన మరునాటినుండియు కాలం లెక్కకు వస్తుంది. అందుకనే 'ఇవ్వాళచస్తే రేపటికి రెండు' అనే సహజోక్తి వాడుకలోకి వచ్చింది.

పూజ్యబాబు కేసరిగారి జీవితచిహ్నాలు యింకా కండ్లలో మెదలుతుండగనే ఆయన కాలధర్మమునొంది సంవత్సరము గిఱ్ఱున తిరిగింది. ఆయన నడిచిన బాటల్లో, నివసించిన గృహాల్లో యీనాటికి సయితం ఆయనలేనికొరత కనుపిస్తుండగా గత నెలలో మృతవార్షిక వర్ధంతి యథావిధిగా స్వగృహములందు - మద్రాసు, తిరుచూరులలో జరిగింది.

మే నెల 27-వ తేదీనుండి 29-వ తేదీవరకు మద్రాసునందలి కేసరికుటీరంలో సాంవత్సరీకాలు బంధు మిత్ర పరివార సమక్షమున జరిగినవి. 30-వ తేదీనాడు షుమారు వందమందికి అన్నప్రదానం జరిగింది.

ఆ రోజులలోనే తిరుచూరునందు బ్రాహ్మణ సంతర్పణ, దాన ధర్మాలు జరిగినవి. వాని ననుసరించి పుట్టికి పైబడిన బియ్యమును అన్నము రాసులుగ వండించి దాని కనువైన సాధకమును, పాయసముతోను 1-వ తేదీన వేలాది బీదప్రజానీకానికి అన్న ప్రదానం పూజ్యారాలు మాధవమ్మగారి సమక్షమున జరుపబడినవి. అన్న ప్రదానమును హర్షించు బాబుకేసరిగారు ఆ వేలాది ప్రజల సంతోష సంతృప్తులతో ఆనందపరవశుడై సుస్థిరమైన ఆత్మశాంతిని పొందియుందురు.

☆ ☆ ☆

చూరు అన్నప్రదాన దృశ్యములు



★



★

# మహిళాబంధు శ్రీ కేసరిగారు

## శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ

ఆ రోజులలో స్త్రీలకొఱకు స్థాపింపబడిన అనసూయ, ఆంధ్రలక్ష్మి పత్రిక లాగిపోయెను. ఆంధ్ర మహిళాహృదయము ఒక చక్కని మాసపత్రిక కొఱకు తపస్సు చేయుచుండెను. మహిళా సమస్యలనెల్ల లేఖారూపమున వ్రాయనుద్దేశించి 'ఆంధ్రలక్ష్మి' యందును, అనసూయయందును శారద లేఖలను పేరుతో కొన్ని లేఖలు వ్రాసిన నేను ఆ లేఖ లాగి పోవుటతో నిరుత్సాహము చెంది మరల నేదైన క్రొత్త పత్రిక వెలువడునా నా లేఖాసారస్వతమును విస్తరింప నవకాశము కలుగునాయని ఎదురు తెన్నులు చూచుచుంటిని. కథలు, వ్యాసములు, ఎన్ని వ్రాయుచున్నను స్త్రీలకు సంబంధించిన లేఖలు వ్రాయవలెనను [illegible] ఇతరరచనలు నాకు తృప్తి నీయవయ్యెను. 1927 సంవత్సరాంతము వఱకు ఆ కుతూహలము తీరినదికాదు.

1928 ప్రారంభములో మా అన్నగారిద్వారా కె. కే. కొత్త శ్రీరామశాస్త్రిగారి కడనుండి వచ్చిన ఒకానొక లేఖతో నా ఆశ మరల చిగిర్చినది. మద్రాసులో డాక్టరు కె. యన్. కేసరి అనువారు స్త్రీల నిమిత్తము గృహలక్ష్మియను మాసపత్రికను స్థాపింపనున్నారనియు, దానికి తమ రచనలను పంపవలసినదిగా వారు కోరుచున్నారనియు ఆయన వ్రాసిరి. శారద లేఖలను పేరుతో కొన్ని లేఖలు, ఆంధ్రలక్ష్మి అనసూయ పత్రికలకు వ్రాసియుంటిననియు, ప్రస్తుత మా పత్రికలు ప్రకటింపబడుటలేదు కావున ఆ లేఖలను



గృహలక్ష్మికి వ్రాయుమనిన వ్రాయుదునని నేను వ్రాసితిని. అందులకు తమ అంగీకారమును తెలుపుచు శాస్త్రిగారును కేసరిగారును జవాబులు వ్రాసిరి. 1928 సం॥ మార్చిలో గృహలక్ష్మి తొలిసంచిక వెలువడెను. తదాది నేను గృహలక్ష్మికి శారద లేఖలు వ్రాయుచుంటిని. ఎడనెడ ఇతర వ్యాసములును కథలును వ్రాయుచుంటిని. స్త్రీల ఆరోగ్య సౌభాగ్యములకై వెలువడిన ఈ పత్రిక శ్రీ కేసరిగారి ఆధిపత్యమున ప్రశంసనీయముగా నడుపబడుచుండెను. అనేకమంది స్త్రీలు గృహలక్ష్మికి తమ రచనలను పంపుచుండిరి.

స్త్రీలకొఱకు పత్రిక నడపుటతో కేసరిగారికి తృప్తికలుగలేదు. స్త్రీలకు రచనయందు ప్రోత్సాహము కలిగించుటకై వ్యాసరచన పోటీల నేర్పరచి ఉత్తమమైన వ్యాసమునకు కేసరి స్వర్ణపతక మొసగునట్లుగా ప్రకటించిరి. 'స్త్రీలు, నాటకరంగ ప్రవేశము, 'స్త్రీ అబలకాదు' అస్పృశ్యతమున్నగు విషయములపై పోటీలు జరిగెను. 'స్త్రీ అబలకాదు' అను వ్యాసమును వ్రాసినందులకు 1930 సంవత్సరములో కేసరి స్వర్ణపతకము నాకు లభించెను.

1934 సంవత్సరంవచ్చినది. గృహలక్ష్మికి ఆరేండ్లు వచ్చినవి. స్త్రీల విద్యావిషయమున కేసరిగారి కుతూహలము ఇనుమడించినది. సాహిత్యమునందును కళలయందును ప్రవీణలైన స్త్రీలను స్వర్ణకంకణముతో సమ్మానించవలెనని కేసరిగారి నిండుమనంబున మతియొక గొప్ప తలంపు కలిగినది. ఈ కంకణ సత్కారముతోబాటు వారి రచనను గూడ గ్రంథరూపమున ప్రచురింపవలెనని కేసరిగారి తలంపు కాబోలు. ఒకనాడు శారదలేఖలు ప్రూఫుల కొన్ని నా వద్దకు వచ్చినవి. నాకేమియు తెలిసినది కాదు. గృహలక్ష్మిలో ప్రకటించిన శారదలేఖలను గ్రంథరూపమున వేసికొనదలంచితిరా అని నేను వారికి లేఖ వ్రాసితిని. మాకు ముందుగా వ్రాయకుండుటలో కొంత పొరబాటు జరిగినదనియు, తాము శారద లేఖలను సంపుటముగా ప్రచురించ నుద్దేశించిన మాట వాస్తవమేననియు, కాని అవి మీకు బహూకరించుటకేననియు, నెల్లూరిలో వర్ధమాన సమాజపక్షమున జరుగు మొల్లజయంత్యుత్సవ సభలో మీకు గృహలక్ష్మి స్వర్ణకంకణ మిచ్చుటకును వానితోబాటు మీ 'శారదలేఖల' సంపుటములు వేయి ప్రతులు గూడ మీ కొసంగుటకును నిశ్చయించుకొంటిమని శ్రీ కేసరిగారు వ్రాసిరి. ఇంతటనుండి ప్రతి సంవత్సరమొక విదుషీమణికి గృహలక్ష్మి స్వర్ణ కంకణ మీయ నిశ్చయించితిమనిగూడ వారు వ్రాసిరి.

తెలుగు నాట ఏనాడును లేని యీ విదుషీ సమ్మానము లేర్పరచుటయు ఆ సమ్మానములు ఎప్పుడో తమ కిష్టమైనవారి కెవరికో ఇచ్చుటగాక వార్షికముగా ఏడాది కొక విదుషీమణి కొసంగబడునను విషయము నాకు సమ్మోద కారణములయ్యెను. ఆంధ్రసోదరీమణుల ఎడలను వారివిద్యావిశేషముల యెడలను కేసరిగారు ఇంతటి ఆదరాభిమానములు చూపుచున్నందులకు ఆంధ్రనారీమణులలో ఒకర్తుకనై నేను కంకణము చేకొనుట ధర్మమని భావించితిని. విద్యతోబాటు సంగీతము చిత్రలేఖనము మొదలగు లలితకళలయందును, దేశసేవయందును కేసరిగారు అత్యంతాభిమానముగల వారనుటకు నిదర్శనముగా బెంగుళూరు నాగరత్నము, రత్నాల కమలాబాయి ఉన్నవ లక్ష్మీబాయమ్మగార్లకు వారొసంగిన స్వర్ణకంకణములు నిరూపించుచున్నవి.

స్త్రీలకొఱకు పత్రిక నడపుట, పోటీవ్యాసము లేర్పరచుట, కంకణసత్కారములు సేయుట మాత్రమే గాదు. స్త్రీల రచనలు కొన్ని తాము ముద్రింపించి వారికి ప్రోత్సాహము కలుగజేసిరి. అన్నియు ఒక యెత్తు మద్రాసునందు వారి కేసరీ కన్యా విద్యాలయ స్థాపన మొక యెత్తు. ఈ విద్యాలయమునకు వారు లక్షరూపాయలు భూరి విరాళమొసంగిరన్న చాలును. స్త్రీ విద్యయందు వారికిగల అసమాన ప్రేమల వెల్లడించుటకు ఆంధ్రదేశమున వదాన్యులు లేకపోలేదు. ధర్మకార్యములు జరగక పోవుటలేదు. కాని ప్రత్యేకముగా స్త్రీలయెడ ఇట్టి గౌరవాదరములు చూపినవారు మాత్రము కేసరిగారొక్కరే. వారికి సాటి పూర్వులలోను లేరు. వర్తమానమునందును కనిపించరు.

ఈ విధముగా తమ కిట్టి అపూర్వాదర సత్కారములు జరిపిన శ్రీ కేసరిగారికి ఆంధ్రమహిళాలోక మెంతయు ఋణపడియున్నది.

గృహలక్ష్మిని స్థాపించక పూర్వము లోధ్ర మున్నగు ఔషధ ప్రకటనలలో కేసరి అను పేరు చూచి శ్రీ కేసరిగారు ఏ బెంగాలీబాబో, ఏ సంయుక్త రాష్ట్రీయుడో అని నేను భావించుచుంటిని. గృహలక్ష్మి స్థాపించిన తరువాత గూడ కొన్నాళ్ళ వరకు నా కాసంశయము వదలలేదు. గృహలక్ష్మి ద్వారా కేసరిగారి పరిచయమైన తరువాత ఎప్పుడైన మద్రాసు వెళ్ళి గృహలక్ష్మి కార్యాలయము చూడవలె నని తలంచుచుంటిని. ఇంతలో దైవికముగా మేము రామేశ్వర యాత్ర వెళ్లుట తటస్థించెను. రామేశ్వరము వెళ్లుచు మద్రాసు రాగలమని నేను శ్రీ కేసరిగారికి వ్రాసితిని. వెంటనే కేసరిగారు 'మీరు మద్రాసు వచ్చినప్పుడు మా యింటికే రావలసినదనియు, నేను వెలనాటి వైదిక బ్రాహ్మణుడననియు, మాది గుంటూరు జిల్లా అద్దంకి గ్రామమనియు, మా యింటిపేరు 'కోట' వారనియు నా పేరు నరసింహమనియు జాబు వ్రాసిరి. ఆ ఉత్తరము చూచుటతో నా సంశయ గ్రంథులన్నియు విడిపోయెను. శ్రీ కేసరిగారుపక్కా తెలుగువారగుటయే గాక మా గుంటూరు జిల్లాకు చెందిన వారగుట నాకు మరింత మోదకారణమయ్యెను. వారు కోరిన ప్రకారము మద్రాసు వెళ్ళినప్పుడు వారి ఆతిధ్యమును స్వీకరించితిమి. వారిని ప్రత్యక్షముగా చూచిన పిమ్మట కట్టులో బొట్టులో మాటలో అచ్చమైన వారి తెలుగుదనము తెలిసికొంటిని. ఆనాడు వారి వంటమనిషి వారియింట గోంగూర పచ్చడి చేయుచుండగా ఈ పచ్చడి ఎవరు తింటారయ్యా ఇక్కడ అని అడిగితిని. అయ్యకు ఈ పచ్చడనిన నిండా ఇష్టమని ఆ వంటవాడు చెప్పెను. ఆహా! గోంగూర పచ్చడి తినుటలో గూడ కేసరిగారు తెనుగు మీరలేదే అనుకొంటిని.

చిన్ననాడు ఒక ఇల్లాలు పెట్టిన అన్నమును గుఱుతుంచుకొని లోధ్రాది స్త్రీ జనోపయుక్త ఔషధ విక్రయములవల్ల కలిగిన సంపత్తికి కృతజ్ఞత పెంచుకొని స్త్రీల అభ్యుదయమునకై సర్వతోముఖ కృషిచేసిన డాక్టరు కే. యన్. కేసరిగారు ధన్యులు. ఆంధ్రమహిళా మండలికి సర్వదా స్మరణీయులు.

తాము స్థాపించిన మహిళాసంస్థలు, సన్మానాది విశేషములు శాశ్వతముగా జరుగునట్లు ఏర్పాటుచేసిన కేసరిగారి దూరదృష్టి, విశాలహృదయము, మహిళాభ్యుదయ కాంక్ష స్తవనీయము.

మానవ జీవితము అజరామరముకాదు. ఆ జీవితములో చేయబడిన సత్కార్యములే అజరామరములు. ఒక మనిషి శాశ్వతుడగుటకు ఆతని కర్తవ్య మెద్దియో శ్రీ కేసరిగారి జీవితము వారి బహువిధ సంస్థలు విశదీకరించుచున్నవి ... సంపన్నులకిది మేలుబంతియై విరాజిల్లును గాక! మహిళాబంధు కేసరిగారి సంస్థలు శాశ్వతములై వర్ధిల్లును గాక!



# కేసరిగారి కావ్యరచన

శ్రీ పేకమళ్ల కామేశ్వరరావు



కేసరిగారు వ్రాసిన నాచిన్ననాటి ముచ్చట్లు అను ఆత్మ చరిత్రను ఆమూలాగ్రంగా నేను చదివేను. ఆయన సులభ భాషలో అనేక అంశాలను, అనేక విషయాలను గురించి అభిప్రాయాలనిస్తూ, తమ జీవితంలోని సూక్ష్మ విషయాలను, స్థూలవిషయాలనుగూడ తెలియజేసేరు. దేనిని గురించి చెప్పవలసివచ్చినాకూడ ఆయన మొహమాటాన్ని కనబరచలేదు. ఆయన వ్రాసినది కేవలం "ఆత్మచరిత్ర" కాదు. ఆటువంటి "ఆత్మచరిత్రల" విలువ సాధారణంగా తమ కుటుంబాలలో మాత్రమే ఉంటుంది. కాని ఇదో? ఆ నాటి దేశంయొక్క స్పష్టమైన చిన్న చిత్రం. ఆ నాటి సాంఘికస్థితి, పల్లెటూళ్లు, పట్టణాలు, చదువు సంధ్యలు, నాగరికత, సంస్థలస్థితి, కొన్ని కళల దశలు, తోలు బొమ్మలు, భాగవతాలు, నాటకాలు, నాటకసంస్థలు, నటకులు, – ఎవరెవరెట్టివారో, పాటకులు, కొంతవరకు కవులు, మదరాసులోని తెలుగువారు, తెలుగు వారికి అరవవారికి ఉండే భేదాలు, తెలుగు వారిలోపాలు మొదలైన వందలకొద్దీ విషయాలను చక్కగా, తేటగా చిత్రించడమే కాకుండ, వాటిని గురించి సూక్ష్మదృష్టితో గూడిన అభిప్రాయాలను వెదజల్లేరు. ఇదంతా ఆ మనిషియొక్క లోతును ప్రకటిస్తుంది. కేసరిగారు అంటే ఇంతటివాడా అనిపిస్తుంది. మనం అసలు కేసరిని చూడాలంటే ఆయన శరీరాన్ని చూచినవారికి తెలియదు. ఆయన పుస్తకాన్ని చదివిన వారికి బోధపడుతుంది. ఒకాయన కేసరిగారంటే మొదట ఆసహ్యించుకొనేవాడు, ఆయన 'చిన్ననాటి ముచ్చట్లు' గ్రంథాన్ని చదివి, "కేసరిగారు ఇంతటి గొప్ప రచయిత, గొప్ప విమర్శకుడు అని నేను ఎన్నడూ అనుకోలేదు. ఆయన పుస్తకాన్ని చదివి నేను ఆశ్చర్యపోయేను. ఆయన బతికిఉంటే నేను ఆయన కాళ్ల మీదపడి వెనకటి నా దురభిప్రాయానికి మన్నించమని ప్రార్థించమనేవాణ్ణి. అట్టి రచయితలు మనకు చాలమంది లేరు" అన్నాడు. కేసరిగారి రచనా నైపుణ్యాన్ని గురించి ఇంతకంటే అభిప్రాయమేమి కావాలి!

# కేసరి మహాశయా నీకివే వేవేల జోహార్లు!

**శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ**

నిరవధికమైన మహా కాలమానంలో మహాశయులు కేసరిగారు చనిపోయిన తర్వాత గిర్రున తిరిగిపోయిన యీసంవత్సరం ఏమీవిలువకలదికాదు. ఈసంవత్సరమే అన్నమాటేమిటి! శ్రీ కేసరిగారి జీవితకాలమైన అరువదేండ్లుకూడా ఒక లెక్కింపదగిన కాలమానమే కాదు.

కాని ఒక్కమారు వెనక్కుతిరిగి ఈ కేసరిగారెవరు? ఎంతమంది పుట్టటంలేదు! ఎంతమంది చావడంలేదు! ఈ కేసరి గారిని గురించి ఎందుకిలాస్మరించుకుంటున్నాము? అని ప్రశ్నించుకుంటే వచ్చే సమాధానము మాత్రం చాల విలువయైనది. భూతభవిష్యద్వర్తమానాదులను దాటి ఆ సమాధానం మహా తేజోవంతంగా మహాదృఢంగా నిలువబడగలది.

కేసరిగారు కూడ "పునరపి మరణం, పునరపి జననం" అనే సామాన్యధోరణి వ్యక్తే కనుక ఆయన ఊరుకొంటే ఆయన జీవితం గడపిన కాలానికీ, ఆయనచరిత్రకీ, ఆయన ఆకారస్వభావాదులకూ ఒకపరిగణన లేనేలేదు - భూతభవిష్యద్వర్తమానాలకు సాక్షీభూతంగా నిలువబడగల ఔజ్జ్వల్యంతో రూపొందిన ప్రవర్థనా నిర్మాణంచేసికొని ప్రవర్తనామయమైన ఆకారసంపదతో కాలానికి కళ్లెంవేసి చరిత్రగానం చేయించుకొన్న మహా పురుషుడాయన - కాబట్టే ఆయన గడపిన ఆ కాలానికి అంతవిలువ! అనిరుద్ధతేజుడై కాలంచేతనే సంకీర్తనం చేయించుకొన్న మహా పురుషునికి మానసిక భావాలతో నిత్యనైవేద్యం సమర్పించి సంస్మృతీదివ్య దీపికాహారతులతో ఆరాధన చేయడంలో - మనబోటి సామాన్యులవిషయంలో అబ్బురమేమున్నది!

ఆయన దొక అసమాన్య ధీరస్వభావము - పువ్వు పుట్టగానే పరిమళిస్తుందన్నట్లు యీ ధీరస్వభావం మొదటినుండీ ఆయన జీవితంలో అలవోకగా పెనవైచుకొని ప్రతిపనిలో ప్రతిబింబిస్తూనే యున్నది. కడుపు గడవనంత లేమిలోనున్న సమయంలో సామాన్యుడైతే ఆ రోజులనాటికి కష్టసాధ్యమైన ప్రయాణాలతో కూడుకొన్న చెన్నపురికి ప్రయాణము కట్టగలడా? అంతమాత్రంతో ఆయన ఊరుకొన్నాడా? 'సాహసే శ్రీః' అన్న సూత్రం ముందే ఆయన ఆకళించుకొన్నాడో యన్నట్లు అక్కడకు చేరినతర్వాత దరిద్రదేవతా ఖిలయతాండవమును నిర్లక్ష్యంచేసి ధైర్యంతో అడుగడుగునా ముందుకు చొరబారి స్వయంవ్యక్తిత్వంతో జీవితనిర్మాణం చేసికొన్న మహా సాహసికుడాయన.

ఆయనదొక విలక్షణ పంథా - వైద్యపరిశోధన చేయడంలోనేమి, ఔషధ ప్రచారం చేయండంలోనేమి, అడుగడుగునా సంభవించే ఆటంకాలను ఎదుర్కొని చరచరా విజయ సౌధాన్ని నిర్మించుకోడంలోనేమి, ఆయనవిలక్షణత్వం చక్కగాపరిస్ఫుటంజేతుంది, ఏదైనా ఒక మహత్తర కార్యం నిర్వహించవలసి వస్తే ఆయనసంఘాన్ని, పరిసరాలను మూఢంగా ఏమాత్రము పాటించకుండా 'సతాంహి సందేహాపదేషు వస్తుషు ప్రమాణమంతఃకరణప్రవృత్తయః' అన్నట్లు తనఅంతఃకరణప్రమాణంతో మాత్రమే మహా ఘనకార్యాలునిర్వహించిన మహా పురుషుడాయన.

ఆయనదొక ఉదాత్తగంభీరప్రకృతి-వైద్యప్రచురణకోసమో అన్నట్లు పత్రిక ఒకటి పెట్టారు. అంతకు క్రితంయున్న ఒకటి రెండు పత్రికలను చూచి అందరూ అనుకొన్నారు - "ఆ - యీ పత్రిక దేశసేవకోసమా ఏమిటి! తన మందుల ప్రచారం కోసంకాని" అని, కాని మళ్ళీ ఒకనాటికి తన కార్యానికి తానే భాష్యం చెప్పుకొనేవరకూ ఎవ్వరికీ బోధపడలేదు - ఆయన

నిర్వహించిన కార్యాలకు అంతరార్థం! ఆయన మహోదారుడు కాకపోతే అతి పేదపరిస్థితిలోనుండి మహోన్నతస్థితికి ఎగబ్రాకి పోయిన ఏ వ్యక్తి తన పేదరికమునాటి పరిస్థితులను గూర్చి అతివినయంగా చెప్పుకుంటాడు? "నా పేదరికంలో ఆదుకొని ఏ భారత మహిళయొక్క అమృతహస్తం నన్ను ఉద్ధరించిందో ఆ మహా కల్పశాఖను నేను కంకణంతో అలంకరించి ఆరాధించడం ఏమీ గొప్పవిషయంకాదు" అని ఆయన ఉన్ముక్త కంఠంతో పల్కడంలోనే ఉన్నది ఆయన ఉదాత్త అంతా. ఈ ఉదారగంభీరతయే ఆయన జీవిత నిర్మాణానికి, మహోచ్ఛదశకూ కీలకం - దాన్ని ఆయన జీవితాంతంవరకు మహాభక్తి భావంతో సగర్వంగా చెప్పుకొనగల్గిన మహోదార గృహస్థు ఆయన.

ఆయన బుద్ధి మహా ప్రతిభావంతమైనది - ఎట్లా అంచనాలు వేసుకొనేవారో మనకు తెలియదు. కాని ఆయన వేసిన పథకాలలో ఏదీ తప్పిపోలేదు. ఏదీ పొరబాటు ఫలితం యీయలేదు. సరియైన ఆలోచన, సక్రమమైన ప్రయోజనము, సంపూర్ణమైన ఫలితము తన జీవితకాలంలోనే అనుభవించి, ఆనందించిన విశేష వ్యక్తి ఆయనే అంటే అతిశయోక్తి ఏమున్నది? ఈనాటికీ కేసరి భవనాలు, లోధ్రాదులూ ఆయన నిర్మాణమైన పుణ్యానికి సాక్షీభూతాలు. నిశితమేధా - సంపత్తితో నిపుణమైన నిర్వహణవిధానాన్ని సాధించిన అప్రతిమాన ప్రతిభావంతుడాయన.

ఆయన ఒక సాధుపుంగవుడు. ఏదో అదిచేశారు-ఇది చేశారు - మందులుకనిపెట్టారూ-వర్తకంచేశారు-పత్రిక నడిపారు - కంకణాలిచ్చారు - పాఠశాలలు పెట్టారు - దేశసేవచేశారు - అంటే ఆ! అంతాడాంబికం, ఆడంబరం అంటేఅనేవచ్చుగాక! కాని అంతరంగికమైన స్వభావ విశేషమేకదా మానవజీవితానికి మచ్చునేగాని, మహత్వాన్ని కానీ పరికల్పించేదీను - ఆయన ధనవంతుడైన తర్వాత ఎంతమంది అన్నార్తలకూ, అగతికులకూ గతి కల్పించారో అవి ఎంత ఏకాంతంగానే యుండిపోయినాయో ఆయన సన్నిహితులకేకాని తెలియదు. ఆకారసదృశమైన ప్రజ్ఞా, ప్రజ్ఞానసదృశమైన ఆగమమూ, ఆగమసదృశమైన ఆరంభమూ, ఆరంభసదృశమైన దయయూ కలిగి, ఆఫలోదయమైన త్యాగసత్కర్మ, కోసం సంభృతార్థియైన మహా సాధుపుంగవుడాయన.

ఏనాడో ఒక నాడు కేసరి - పుట్టలేదు ఆ నాడు కేసరిలేదు, కేసరి చేసిన పనులూ లేవు. - కేసరి నిర్వహణమూ, ప్రజ్ఞాకీర్తి ఏమీ లేవు. ఒకనాడు ఆ మహాఘనుడుదయించాడు. ఆనాటినుండీ ఆ పుణ్యముహూర్తంలో ఆ అబోధ శైశవంలో, ఆ గంభీరమేధస్సుల అంతరాంతరాల్లో అప్రగాఢ ప్రతిభాప్రవృత్తిలో యివన్నీ గర్భీకృతంగా ఉండ నేయున్నాయి. ఈనాడు అన్నీ ఒక పాలవెల్లిలా వెల్లివిరిశాయి. గుణికి, గుణానికి అభేదం చేస్తే కేసరి వేరు, కేసరిగారు నిర్వహించిన కార్యాలు వేరూ కానేకాదు. కేసరిగారే పాలవెల్లి అయితే లోధ్ర, అమృత, అర్క, గృహలక్ష్మి, కేసరిభవనాలు, కేసరి విద్యాలయములు, కేసరి కంకణం, యింకా ఎన్నో సత్కార్యాలు అన్నీ కల్పవృక్షమూ, కామధేనువూ, మహాలక్ష్మి, చంద్రుమున్నూ, చింతామణి, కౌస్తుభము, - కట్టకడపటకు అమృత భాండారముగా తెలుగునాట - నానాట అవతరించాయి.

అందుకే యీనాడు కేసరిగా రుదయించిన కాలానికీ, ఆయన జీవితానికీ, ఆయన పుణ్యమూర్తికీ యింత ఆరాధన!

అందుకే తెలుగులకింత వెలుగిచ్చిన ఆ మహా తేజస్సునకింత అర్హాస్మృతి గౌరవం!!

అందుకే విశ్వానికింత గుణపాఠం నేర్పిన ఆమహా ప్రవక్తకింత సంస్మృతీసమ్మానం!!

మహాపురుషులు పుట్టకపోతే కాలానికి దేశానికి గుర్తింపేమి?

నిరవధికమైన కాలానికీ, విపులమైన పృథ్వికీ, అత్యధిక మహిమాన్వితమైన ఆకృతిపరిగణన కల్పించి యిచ్చిన మహాయశస్వీ - కేసరి మహాశయా! నీకివే వేవేల జోహార్లు!!!

# శ్రీ కేసరిగారి స్మృతి

శ్రీమతి దేశిరాజు భారతీదేవి



విద్యాలయంబు స్థాపించుట జేసి విద్యాభిమానంబు దా నలర జేసె
ఔషధసంతతి నందించి యోషాచయంబు పైనాదర మలర జేసె
స్వర్ణకంకణ ముఖ్య బహుళ బహూకృతి వనితాభివృద్ధిని వరల జేసె
తన చిన్ననాటి గాథల నెల్లయుం దెల్పి వినయ సత్యాసక్తి వెలయు జేసె
కోటనర కేసరీ ఖ్యాతి నాటి సాటి-లేని సత్కీర్తి నీనాట బూనగలిగె
నామహాత్ముని వర్ధంతి యడరు వేళ-హృదయమున మోదఖేద సంస్మృతులుగలిగె.
అంధకార మయంబగునట్టి తనదు-బాల్యమున నాత్మ ధీశక్తి పాటవమున
మెరపుతీవెల మొలిపించి మింట మంట-వెలుగులు రహింపజేసిన విశ్రుతుండు
మార్గదర్శియై యొప్పెడు మానవులకూ. 2

కలిమిని లేమియందు నుపకార పరంపరయే స్వభావమై
పలు తెఱగు ల్ఘటించుకొని పాయని దీక్షస్వబుద్ధి సాధనా
బలమున తాను వృద్ధిగని బంధులు నన్యులు వృద్ధిగొందగా
గలుగు క్రియాకలాపమున గాంచె జయంబనిశంబు ధారుణిన్. 3

ఎవ్వని మంచిపేరు రహియించెడు ధారుణినంతకాలమా
మవ్వపు కీర్తిశాలి యనుమానము లేక సుభాను భాతినే
సవ్వదిలేక స్వర్గమున సౌఖ్యముగాంచునటందురౌటదా
నెవ్విధి స్వర్గమందున వసించెడు కేసరి యెల్లకాలమున్. 4

కాయము వాసినన్ దివిజ కాయమునందుటచేత దాజగ
ద్ధేయ సుకార్యముల్ పరిణతిం గనుపట్ల నమోఘదీక్షతో
జేయుత సర్వయత్నముల జేయ బలప్రతిభాత్త చిత్తుడై
పాయని కూర్మి కేసరి యభంగిత భంగుల నెల్ల కాలమున్. 5

కేసరి గర్జనంబువలె కేసరి వాక్కుల మోఘలీలన
భ్యాసక కర్ణకోటరములందు జొరంబడి మేలుకొల్పి యు
ద్భాసితలీల హత్తుకొన వారలచేతన సంస్థలున్ నిరా
యాసత వృద్ధిగాంచుగతి నందగ జేయుత దీర్ఘకాలమున్. 6



# విశ్వజ్యోతి

"రాయసం సోదరీమణులు"

నటీనటులు

సుధాకర్ : 23 సం॥ బి. ఏ.

మనోహర్ : 22 సం॥ బి.ఏ. సుధాకర్ స్నేహితుడు

చంద్రయ్య : 40 సం॥ పెద్దరైతు

వెంకయ్య : ఇంకొకరైతు

మోహన్ :22 సం॥ సుధాకర్ స్నేహితుడు బి. కాం.

జ్యోతి : సుధాకర్ చెల్లెలు 15 సం॥ వయస్సు

సరళ : సుధాకర్ భార్య 18 సం॥ ,,

మొదటి రంగము

[ఒక టేబులు, దానిమీద పూలటేబులు క్లాతు, వీరేశలింగముగారి ఫోటో గోడకు తగిలించి వుంటుంది.

జ్యోతి కుర్చీలో కూర్చొని తల దువ్వుకుంటూ పాట పాడుతుంటుంది.]

పాట

నీదీసంఘము, నీదీ దేశము
నీవేసర్వం సంఘంలో
అన్యాయాలను అంత మొందించు,
సంఘానంతా స్వర్గము చెయ్యి
విశ్వజ్యోతిని వెలిగింప వోయి వీరుడా!
నీదీసంఘము, నీదీ దేశము
అవతరింపు మోయి ఆశాజ్యోతిని
వీరుడవోలె విశ్వజ్యోతిని
వెలిగింపు మోయీ!
నీవేసర్వం సంఘములో ... ...

["వినండి! వినండి!" అంటూ సరళ ప్రవేశిస్తుంది.]

సరళ:- ఎక్కడిదిది జ్యోతీ! ఈ పాట.

జ్యోతి:- మా అన్నయ్య వ్రాసింది.

స: నీకూ పట్టుకుందీ ఈ పాటల రచనలపిచ్చి!

జ్యో:- నీకేంతెలుసు వదినా ప్రస్తుతం మన సంఘములో వుండే దురాచారాలు, అవినీతి! మగవాడంటే చాలు - సర్వస్వతంత్రుడు. మనసంఘపు ఉద్దేశ్యములో మగవాడు చేసే ప్రతిదీ అమోదకరంగా వుంటాయి. కాని ... ...

స:- ఇంకేం నీవు అన్నగారిముందు ఏవిధంగాను తీసిపోవు!

జ్యో: చాదస్తపు వదినా! నీకు ప్రపంచములో భారతీయ సంఘములో జరిగే ఈ విషయాలేవి కనిపించడములేదా? ఎంతమంది తేరు జీవితము మీద విరక్తిపుట్టి సంఘాన్ని ద్వేషించేవాళ్లు. ఈ అక్రమాలు, అన్యాయాలు ఎన్నాళ్లు యిలాగే జరిగిపోవాలి? ఏ మహావ్యక్తి కొంతవరకైనా మార్చ కలుగుతాడో అనాడే సంఘము స్వర్గమవుతుంది.

స:- నీవు చెప్పేవి నేను ఎన్నో పుస్తకాల్లో చదివేను. ఎన్నోపాటల్లో విన్నాను. ఎన్నో కథల్లోవిని కన్నీరు కార్చాను; కాని ఏంచెయ్యగలము?

జ్యో:- వదినా! ఆ మాటే వద్దంటాను. ఆడవాళ్లయినంత మాత్రాన మనం అసమర్థులమా? ఇంత అవినీతి సంఘములో వుండేటప్పుడు అనూత్రాలను ఎందుకు పాటించడము? త్రికరణశుద్ధిగా మనకు ఒక విషయము సమంజసము అని తోస్తే అది సంఘంలో మరి ఏవిధంగా, ఏవ్యక్తిని ఆటంక

పరిచయముండా, నిరుపకారాయకరంగా వుంటే అది మనము స్వతంత్రించి చేయడము ఏంతప్పులేదను కొంటాను.

[సుధాకర్ ప్రవేశం]

సుధాకర్:-ఏం అమ్మాయి! జోరుగా ఉన్నదే ఉపన్యాసము - యెవరికి-సరళ కేనా?

స:-ఆ నాకే - నాకెందుకు ఆ ఉపన్యాసాలు? నేనేం ఆచరణలో పెట్టగలనా ఏమిటి!

[సుధాకర్ ఆ ప్రక్క కుర్చీలో కుర్చొని బూట్సు విప్పుకుంటుంటాడు]

జ్యో:-ఏం వదినా! నీభావాలను ఎవరు ఆటంకపరచుతారు. నీపాటికి నీవు సర్వ స్వతంత్రురాలివి.

స:-నాకెందుకులేమ్మా! ఆ స్వాతంత్ర్యం ...

[జ్యోతి, సుధాకర్ పక్కన నవ్వుతారు]

[మనోహర్ ప్రవేశం]

సు: ఏమోయ్ మనోహర్ యింత వానలో యెక్కడి నుంచి - ఆఫీసునుంచేనా? అయితే ఆ బట్టలు మార్చి తుడుచుకొని వేరేబట్టలు వేసుకో. జ్యోతీ! మనోహర్‌కు టవలు, పంచ, చొక్కా యియ్యి బీరువాలోనుంచి.

[జ్యోతి లోపలికిపోయి గుడ్డలతో ప్రవేశించి మనోహర్‌కు యిస్తుంది]

మనోహర్:-ఏ విషయము దీర్ఘంగా ఆలోచన జరుగుతున్నది?

స:-ఏముంది స్త్రీ స్వాతంత్ర్యమట - ఈ సినిమాల్లో నాటకాల్లో పిచ్చి-ఈ అన్నచెల్లెళ్ళకు పట్టుకుంది నేనేమన్నా చెప్తే ఎగతాళి.

మ:-అవును. నాకూ జ్యోతి సంఘసంస్కర్త అవుతుందా అని అనుమానం వేస్తున్నది.

[మనోహర్ లోపలికిపోయి గుడ్డలు మార్చుకొని ప్రవేశం.]

స:-ఏం జ్యోతీ! మాట్లాడవేం! ఇంతలో యేమైంది ఆ స్వాతంత్ర్యం.

జ్యో:-ఏం నాకేం భయము! (అంటూ నేలను కాలితో రాస్తూ ఉంటుంది.

[మనోహర్ సుధాకర్‌లు నవ్వుతారు]

సు:-ఏమిటి విశేషాలు మనోహర్! మన చంద్రయ్యే చైర్‌మన్‌గా నిలబడతాడని విన్నానే.

మ:-అవునది ఎప్పటినుంచో అనుకునే విషయమేగా!

సు: నా అభిప్రాయము మన మోహన్ చైర్‌మన్ అయితే కాస్త కష్టసుఖాల విచక్షతో బాగా ఉంటుందని-ఏలాగైనా చదువుకొన్నవాళ్లే అధికారాల్లో వుంటే న్యాయంగా అన్ని విషయాలు తెలుస్తాయి.

మ: నీవింకా వెనకటి కాలంలోనే ఉన్నావు. కాకపోతే ఈ కాలంలో చదువుకు విలువ యెక్కడ ఉన్నది. అధికారులంతా చదువుకొని విజ్ఞానం ఉన్నవాళ్లయితే, రాయలసీమ రత్నాలసీమగా అయి భారతదేశం రత్నగర్భ కాదూ? నాకూ మోహన్ చైర్‌మన్ అయితే బాగుంటుందని తోచిందిగాని, చంద్రయ్యే యిన్ని సంవత్సరాల నుంచి ఆయిదారువేలు ఖర్చుపెట్టేవాడు ఏం పోటీ లేకుండ వుంటేనే. ఈ సంవత్సరం పోటీ వుంటే యింకా ఎక్కువ ఖర్చుచేస్తాడు మోహన్ యేం ఖర్చు చేయగలడు పాపం! అందుకని మోహన్‌ను నిలపకుండా వుండడం మంచిదని నా అభిప్రాయం.

సు:-మనోహర్! నేనూ అదే ఆలోచించాను. ఈ విషయాలన్ని ప్రజలకు మా మొక ఉపన్యాసముగా తెలియచెప్పదాం. చంద్రయ్యకోకూడ చెప్పిచూదాం.

జో్యః-చంద్రయ్య అయిదారు సంవత్సరములనుంచి చైర్మన్‌గా!......!

సుః-అందుకనే యెట్లావుందో చూడు మునిసిపాలిటి విషయం-ఆరోడ్లమీద ఒకఫర్లాంగు ప్రయాణము చేస్తేచాలు - మంచి పస్ట్‌క్లాసు ఎక్సెర్‌సైజ్! వీధిలైట్లు చంద్రయ్యగారి యింటిదగ్గర ఒకటి. వెంకయ్యగారి యింటిదగ్గర ఒకటి. మిగతవాటికి కొన్నిటికి గ్లాసులు వుండవు; కొన్నిటికి వొత్తు లుండవు. ఎట్లయినా చంద్రయ్య మళ్ళీ చైర్మన్ అవుతాడని కదా అతనిధీమా ...

జో్యః-ప్రజలు అంతమాత్రం అర్థం చేసుకోలేరూ!

మః-ఉపన్యాసాలేం పనిచేస్తాయి! ఓటుకు నూరు రూపాయలుపైగా ఖర్చుచెయ్యకలడు. అయినా - సరే రేపుసాయంత్రం ఒక సమావేశము ఏర్పాటు చేద్దాం.

సః-ఇంతకుముందు ఇట్లానే ఉపన్యాసాల ధోరణి అనుకుంటే ఇప్పుడు ఊళ్ళోకూడ మొదలు పెడు తున్నారన్నమాట - కానీయండి. ఏం కావలెనో అది అవుతుంది. నా కెందుకండీ! మీ యిష్టం. చైర్మన్ అయితే ఏం ఒరిగింది.

[మిగత ముగ్గురు నవ్వుతారు]

(తెర)

రెండవరంగం

[ప్రేక్షకులలో స్టేజీముందే కుర్చీలలో వెంకయ్య చంద్రయ్య కూర్చుంటారు. ఆ ప్రక్కన నటీనటవర్గా నికి సంబంధించినవారు కూర్చొని వుంటారు. మనో హర్, సుధాకర్, మోహన్‌లు బండమీద కూర్చొని యుంటారు]

సుః-ప్రేక్షక మహాశయులారా! మిమ్ములందర్ని యిక్కడికి రమ్మని ఎందుకు ప్రార్థించామో మీకు తెలిసిందే. మన వూళ్లో చైర్మన్ ఎన్నికలు జరగబోతున్నాయి. మీ ఓటు కెంతేనా విలువ వుంది. మేము యిప్పుడు మాట్లాడబోయ్యేమాటలు ఎవరి నుద్దేశించినవీ కావు. అన్ని జాగ్రత్తగావిని నిజానిజాలను తెలిసికోమని మా ప్రార్థన. సుధా కర్ ఆ విషయాన్ని గురించి మాట్లాడతాడు. కాబట్టి ఓపికగా వినండి.

సుః-ప్రేక్షక మహాశయులారా! నమస్తే. మనము యే పని చెయ్యడానికైనా విచక్షణ జ్ఞానము అవస రము. విచక్షణ జ్ఞానము విద్యవల్ల లభిస్తుంది. యీ ఏడు మన వూరి చైర్మన్ ఎన్నికలు చూడండి - కాబోయే చైర్మన్ బాగా చదువుకొన్న వాడ యితే అన్ని విషయాలను బాగా చూచుకోడానికి, నిర్వహించడానికి సమర్థుడవుతాడు. మిగత పెద్దలు మన కన్నివిషయాల్లో సహాయము చేస్తుంటారు. వాళ్లసలహాలు పాటించవచ్చు. అది గాకుండా ఒక్కరే సంవత్సరాల పాటుంటే ఆ గ్రామానికి ఏవిధంగాను అభివృద్ధి కనపడదు. కాబట్టి మహా శయులారా! ఈ విషయాలంతా మనస్సులో వుంచుకొని మీ ఓటును సద్వినియోగము చేసుకో మని నా మనవి.

మోః-మీరంతావచ్చి శ్రద్ధగా మా ఉపన్యాసాన్ని విన్నందుకు నే నెంతో కృతజ్ఞుణ్ణి.

[మోహన్, సుధాకర్, మనోహరులు నిష్క్రమిస్తారు]

[వెంకయ్య, చంద్రయ్య ఇద్దరూబండ మీదెక్కి]

చః-విన్నావుకదూ ... సతుకులు ... చదివి చదివి మహా చేస్తున్నారు ... దేశంలో మిగతా వారు చెయ్యలేని దానిని మొగోళ్లు! సతికారట ... ఉద్ధారకులు బయలుదేరేరు.

వెంకయ్యః-మోహన్ అగుతాడండీ చైర్మన్‌గా! ఎవరంటే వాళ్లయితే దాని హోదాకూడాపోదు.

చః-మోహన్ కొంపలో వస్తువుల నమ్ముకొని సతి కాడు కదూ! ... ఇప్పుడేం అఘోరిస్తున్నట్టు (ఆలోచిస్తూ) అయినా వీళ్లంతా మొన్నటిదాక మొలమీద తాడులేని వెధవలు; ఇప్పుడు పెద్ద సంస్కర్తలయ్యారు,

వెంః-మోహన్‌కు మీరంటే మంచి గౌరవమండి. ముందు కౌన్సిలరుగా గూడా నిలబడనంటే ఈ మనోహర్, సుధాకర్‌లు ఆయనను బలపరచారు.

చః-ఒరే వెంకయ్యా! వీళ్లంతా గెలుస్తారనేనా నీ ఉద్దేశ్యం! ఉన్న నాలుగు రాళ్లు వదిలించుకొని మళ్లీ మన కాళ్లదగ్గఱ చేర్తారు. లేకపోతే వీళ్ళగతి ఆలోచించుకోమను. వాళ్లను సర్వనాశనము చెయ్యగలను.

(తెర)

సకేషము



## 'దుర్గాదాస్' నాటక ప్రదర్శనము

చెన్నపురి ఆంధ్రవిజ్ఞానసమితివారు యీనెల 6 వ తేదీన మ్యూజియంహాలులో 'దుర్గాదాస్' నాటక ప్రదర్శించారు.

ఇది చరిత్రాత్మక నాటకం. ఇందులో ఔరంగజేబ్ చక్రవర్తి కాలమునాటి పరిస్థితులు - మొగలుల నిరంకుశత్వము, హిందూమతద్వేషము, హిందూరాజుల పరాక్రమశౌర్యాలు, వారిలోని అనైక్యత మొదలగు వానితో బాటు హిందూముసల్మానుల ఐకమత్యము, పరమత సహనము, సౌభ్రాతృత్వమును ప్రబోధించేదిది. ఈ నాటకమును ప్రదర్శించాలనే పట్టుదలతో సమితి వారు చేసిన కృషి ప్రశంసనీయము. నాటక ప్రదర్శనంలో కొన్ని ఒడిదుడుకులున్నా శంభాజీ, దుర్గాదాస్, గుల్నార్, ఔరంగజేబు, రాణీమహామాయ భూమికలను నిర్వహించిన శ్రీ రాజనాల, కాంతారావు, యం. రమాదేవి, జి. వి. రామమూర్తి, పి. రమాదేవిగారలు చక్కగా పాత్రౌచిత్యాన్ని పోషించి నటించారు. దిలేర్‌ఖాన్‌గా నటించిన శ్రీ ఎ. రామనాథశాస్త్రిగారు నాటకరంగంలో తమకు గల అపార అనుభవ విశేషాలతో నటించారు. సరస్వతిగా నటించిన టి. జయకుమారి, నృత్యముచేసిన రాజేశ్వరి, సావిత్రిగారలకు చక్కని భవిష్యత్ కలదనిపించింది.

మొత్తంమీద నాటకం రసవంతంగా, చక్కగా నున్నా ప్రేక్షకుల సంఖ్య చెప్పుకో తగినంతదిగా లేక పోవడం విచారకరం. ఇందుకు కారణం మద్రాసు నగరంలోని తెలుగువారికి తెలుగు నాటకకళ పట్లగల ఉదాసీనతయే కారణమేమో! నగరంలోని ఆంధ్రులకు ప్రాతినిధ్యము వహిస్తున్న ఆంధ్రవిజ్ఞానసమితి కార్యక్రమాలపట్ల ఆసక్తితో పాల్గొని తోడ్పడడం వారి పురోభివృద్ధిని వారు తీర్చి దిద్దుకోడం తప్ప మరేమి కాదు. సి. సి.

## ఎ. వి. యం. వారి చిత్రం 'సంఘం'

'సంఘం' చిత్రనిర్మాణం యించుమించుగా పూర్తయింది. నాలుగు సంవత్సరాల కాలంగా, నలభైలక్షల రూపాయల వ్యయంతో 16 వన్నెలలో ఆకర్షణీయంగా తయారయింది.

ఇందులో వైజయంతీమాల నాట్యాలు, రంగారావు ప్రత్యేకమైన నటనాకౌశలము పేర్కొనవలసినవి. ఈ నెలలోనే విడుదల కాగలదు.



# పూజా పుష్పాలు

శ్రీ సి. సి. సున్నయ్య

ఇవి మాతాపితలకు సమర్పించే పూజా పుష్పాలు. వానితోనే పితృతుల్యులైన పూజ్యబాబును వారి యీ ప్రథమ మృత వార్షికవర్ధంతి సందర్భమున పూజిస్తూ అంజలి ఘటించుచుండుట మాకు యిహపరాలలో సద్గతి లభ్యము కాగలదని నమ్ముచున్నాము.

పూజ్యబాబును యీనాడు, ఆనాడు కూడ ప్రేమించి ఆరాధిస్తున్నాము. మేము తన బిడ్డలము కాకపోయినా అంతకంటె ఎక్కువగా ఆయన మా పట్ల ఆదర ప్రేమాభిమానములు జీవితాంతమువరకు కలిగియుండిన ప్రేమస్వరూపి. దాని ఫలితంగానే మా జీవిత రేఖలను తీర్చి దిద్దుకోడానికి అవకాశము లభించింది. ఆయన మేలును, ఆదర ప్రేమలను మేము యావజ్జీవ పర్యంతము మరువలేము సరిగదా . రానున్న తరతరాలకు మా సంతతి కృతజ్ఞతాపూర్వకంగా వారి నారాధించి ప్రేమిస్తుంది.

మేము ఆత్మ, పరమాత్మ ప్రేరేపితులమై ప్రేమారాధనలతో పాటు ఆయన అనారోగ్య సందర్భమున నిష్కల్మష హృదయంతో సేవకుపక్రమించాము. ఆయనకు సేవజేయడం పరమాత్మను సేవించడంగా నమ్మాము. ఆయన సంతృప్తి సద్భావాలు మా జీవయాత్ర కొక వెలుగనిపించింది.

ఆయన కోపతాపాలు భయభ్రాంతులను జేసిన సమయాలున్నవి ; మేము మానసికంగా విపరీతమైన ఆవేదనపడిన రోజులూ యున్నవి. కాని అవి క్షణికములు. అవైనా మా తాపితలను స్మరణకు తెస్తూ మా జీవితమార్గమును సరిదిద్దడానికి వుద్దేశించినవి.

ఆయన కుటుంబము, ప్రియతమమైన సంస్థలు సర్వతోముఖంగా వర్ధిల్లుతూ పూజ్యబాబు విశాలభావాలు, వదాన్యత పెంపొందడం పితృదేవతా స్వరూపుడైన వారికి సుస్థిరమైన ఆత్మశాంతిని సమకూర్చును.

తిరుమూరు అన్నప్రదాన దృశ్యములు



పాల్గొనిన బంధుజనము

# కుటుంబ సౌభాగ్యానికి

శ్రీమతి అల్లూరి సోదరి

రేఖ అదే తొలిసారిగా అత్తింటి గడపతొక్కడం. తోటివారు ప్రతియొక్కరు తాను అత్తింటికెళ్లేటప్పుడు కంటతడి పెట్టుకొని "జాగ్రత, ఎలా మసలుకుంటావో" అన్నారు. అమ్మా, నాన్నా "వెళ్ళిరామ్మా - కొత్తచోటు, పసితనపు చేష్టలు చేయకు" అన్నారు దుఃఖంతో.

ప్రతిమాటా రేఖను కలవరపరచింది. అత్తవారింటి కెళ్ళడమనేది, ఆడపిల్ల జీవితములో అదొక భయంకరావస్థ కాబోలనుకుంది. నుదుట కుంకుమతో, ప్రయాణాయాసముచేత కొద్దిగా వాడిన పూలతో, సౌందర్యం ఒలకపోస్తున్న ముద్దుమొగముతో రేఖ ఆ యింట్లో అడుగు పెట్టింది.

"వదినె వస్తూంది అమ్మా! ఓ అమ్మా" అంటూ పిల్లలు బిలబిలా పరుగులెత్తారు వంట యింట్లోకి. భాగీరధి చిరునవ్వుతో హాలులోనికివచ్చి కోడల్ని ఆప్యాయంగా పలకరించింది. రేఖ వెంబడివచ్చిన పెద్దన్నను పలుకరించిన తరువాత ఆమె రేఖను తీసుకొని లోపలికి వెళ్లింది.

"రేఖా! కాస్త కాఫీచేయి. నేను నాలుగు పూరీలు కాలుస్తాను. మీ యన్నకిత్తువుగాని" అంది భాగీరథి. రేఖ గ్రహించింది. ఇచ్చట తానూ పనిలోకి ప్రవేశింపవచ్చునని. పూరీలు, కాఫీ ఒకేమారు రెడీ అయినవి. "మీయన్నకిచ్చిరా" అని పంపింది భాగీరధి.

భాగీరథినిచూచి రేఖకి ప్రేమ, భక్తి ఒకేసారి గలిగినవి. ఈ యింట్లో తాను స్వంతమనిషిలానే మెలగాలేమో అనుకుని రేఖ అన్నయ్యకు కాఫీ పూరీలు యిచ్చి వచ్చింది. కాఫీ యేమీ బాగాలేదు. అది రేఖ ఎప్పుడూ కాచినదిలేదు. అత్తయ్య కోప్పడుతుందని రేఖ దిగాలుపడిపోయింది. కాని భాగీరథి కోప్పడలేదు సరికదా, "నీవు వాడుకలేవు రేఖా! చేస్తుంటే చక్కగా తయారుచేయగలవు" అంది. రేఖకి ఆమె హృదయం అర్థమయింది.

తాను పసిది తనకేమీ తెలియదు. ఆమె వల్లనే తానిప్పుడు ధైర్యంగావుంది. ఇంతలో మేడదిగి మామగారొచ్చి, రేఖను, పలుకరించారు. "దిగులు పడబోకమ్మా రేఖా! మీ అత్తయ్య నీకు పెద్దగా వుంటుంది" అన్నారు. ఆయన్ను చూడగానే రేఖకు భక్తి గౌరవమూ దానంతటవే కలిగినవి.

పదహైదేండ్ల రేఖ అత్తగారిల్లంటే యిదేనా అని విస్తుపోయింది. ప్రొద్దున్నే లేవడం స్నానంచేసి చక్కగా జడ అల్లుకోవడం, ఆ తరువాత కుంపటి కగ్గివేసి, కాఫీ కాచేది. తరువాత అత్తగారూ, ఒకరొకరేలేచి కాఫీకొచ్చేవారు. ఇవ్వడం మాత్రం అత్తగారికే వదిలేసేది రేఖ.

రెండు వెండిగ్లాసులనిండా కాఫీపట్టుకొని ఒకటి మామగారికీ, ఒకటి మేడమీదికీ పట్టుకెళ్లేది. మేడమీది నల్లకళ్లు తనకోసం ఎదురు చూస్తుంటవి. పదింటికల్లా ఆయన కాలేజీ కెళ్తారు. భోజనం పన్నెండుకు కాని కాదు. కాస్త వుప్పిండో, దోశో చేసి తన అత్తగారు యిచ్చి రమ్మనేవారు.

తరువాత అత్తగారికీ కూరలు తరిగిచ్చేది. తప్పేలాలో బియ్యంపోసి అక్కడ పెట్టేది. ఇలాగే కావలసినవన్నీ అమర్చిపెట్టి, తానూ వెళ్ళిపోయేది. సామాను సర్ది పెట్టడం, తన చిన్ని మరదండ్రక్కూ, మరదులకూ ముస్తాబుచేయడం, నీళ్ళు పని మనిషిచేదిస్తే, అందుకోవడంలాంటి చిన్న పనులు చేసుకుంటూ వుండేది.

వంట అయిందంటే పిల్లలూ, మామగారూ భోంచేసేవారు. ఒంటిగంటకు కాలేజీనుండి ఆయనా వచ్చేవారు. ముగ్గురూకలిసి భోంచేసేవారు. రేఖ ఆ యింట్లో ఓ దేవకన్యలాగుండేది. ప్రభాకరం తరువాత, ఆ యింట్లో అందరూ చిన్నపిల్లలేగా. ప్రభాకరం కాలేజీకి వెళ్లేవాడు. ఇక రేఖ ఆ యింట్లో చిన్నలేడి పిల్లలా చెంగు చెంగున గంతులు వేస్తూ, నిరంతరం మధుర మందహాసం వెలిగిస్తూ ఆ యింటికో వింతశోభ చేకూరుస్తుండేది.

ఇక పండుగపూటా తననుచూచి, భాగీరథి కళ్లల్లో వెలిగే ఆనందరేఖల గుర్తించి, రేఖ కృతజ్ఞతగా చిరునవ్వు నవ్వేది. రేఖ పురుటికోసం పుట్టింటి కెళ్లింది. వెళ్ళిన పదిరోజులవరకూ, మిత్రులతో, అత్తగారింటి సౌభాగ్యాన్ని గురించి చెప్పుకుంటూనే గడిచింది.

మరో నాలుగు నెలలకు రేఖ ఆడశిశువుని కన్నది. అత్తగారింటివారు వచ్చారు. ఆ పదిరోజులూ అక్కడే వుండి పదకొండోనాడు బారసాల మహా వైభవంగా జరిపించి అత్తగారింటివాళ్లు వెళ్ళిపోయారు.

మరో నాలుగు మాసాలకి రేఖ పాపాయితో అత్తగారింటికొచ్చింది. కోడలికి దిష్టితీసి స్వాగతం యిచ్చింది భాగీరథి. మామగారు పాపాయి నందుకున్నారు. "మాకేమిటి తెచ్చావు?" అని పిల్లలు గోలచేస్తున్నారు.

ఆయనగారి అనురాగమూ రేఖని కలవరపెట్టింది. ఆ రాత్రి రేఖ దీర్ఘంగా ఆలోచిస్తూ పండుకున్నది. తన బాల్యం పుట్టింటిలో గడిచింది. విశాల హృదయం, విశ్వమానవప్రేమ, పెద్దవారిపై గౌరవమూ, భర్తతో సంచరించేడి విధానము, భాగీరథివలన తాను నేర్చుకున్నది. ఆమె వడిలో తాను సంపూర్ణ స్త్రీత్వము సంపాదించింది.

కొందరి అత్తగార్లు చీటికీ, మాటికీ కోడళ్ళను తిట్టూవుంటారు. కాని తన అత్తగారు తన తల్లిలాంటి అమృతమయి. బాలికలను వారి మనస్తత్వరీత్యా అందుబాటులోనికి తీసుకురావాలికాని, అనుభవం లేక, బాల్యదశనుండి వ్యక్తతకు అప్పుడప్పుడే వస్తున్న బాలికలను, అత్తలు బాధపెట్టడం, వ్యక్తిద్వేషం పెంచడంవంటిది.

కాని తన కలాంటి విషపాత్ర లభింపలేదు. మొదటి పరిచయంలోనే భాగీరథిమీద తనకు భక్తి కలిగింది. తనవంటి సాధుబాలికకు అలాంటి అసాధ్యపు అత్త దొరికివుంటే - రేఖ వణికింది - తన స్థితి అధోగతే. కాని ... రేఖకు భాగీరథి ప్రేమ హృదయం ఒక్కసారి కన్పడింది. రేఖ ఆమెకు తన హృదయంలోనే నమస్కరించింది.

"ఏంరేఖా! ఇంకా నిద్రపోలేదా?" అప్పుడే లోనికివచ్చిన ప్రభాకరం పలకరించాడు. రేఖ చిరునవ్వు నవ్వింది.

---

యజమాని:-ఒరే వెధవా చెప్పినపని చెయ్యవు నీ వసలు మనిషివేనటరా?

నౌకరు:-నేను మనిషిని కానిచో ఒరే వెధవా అని మీరు పిలుస్తారటండీ?

♦ ♦ ♦

యజమాని:-ఒరే తమలపాకులు, రెండు సిగరెట్లు తీసుకొని మిగతా వాపసు తీసుకురారా.

నౌకరు:-అయ్యా మరి వాపసు అర్థవీశె చాలా అండి.

♦ ♦ ♦

రాము:-వీపుమీదకొట్టకు అసలేపేలి అట్ట కట్టింది.

సోము:-ఒకటిస్తే ఆ అట్ట కాస్త ఊడుతుందిరా.

కుమారి పి. శాంత

---



# నొప్పితో అవస్థనా?

# "నోపెయిన్"

ఒక కలకత్తా కెమికల్ తయారింపు

మద్రాసు ఆఫీసు : 5/149 బ్రాడ్వే, మద్రాసు 1.

# "రేడియో గీతం"

కుమారి శిరిపురపు జజయ

"ఏమగునో నా హృదయనావ
పెనుతుఫాను రేగెను విషాదసాగరిలో"

అంటూ సన్నగా వినిపిస్తోంది ప్రక్కమేడలోంచి. అది సంధ్యా సమయం. సూర్యభగవానుడు పశ్చిమాద్రిలో గ్రుంకిపోతున్నాడు. సహజ ప్రచండ భానుని పలాయనం పసిగట్టి విజయగర్వంతో చందమామ నక్షత్రముల మధ్యనుండి పయనమౌతున్నాడు. శీవెన్నెల మేను నలందుకొనిన చందినివల హాయినిస్తోంది. ఇప్పుడు రేడియో గీతం వినిపించడం లేదు. ప్రక్కమేడమీద విద్యుద్దీపాలు వెలిగించబడినయ్. శేఖర్ తదేకంగా ఆ మేడవైపే చూస్తున్నాడు. మనుష్యుల అలజడి ఎక్కడా వినిపించడం లేదు. ఉన్నట్టుండి చటుక్కున జ్ఞాపకానికొచ్చింది తన గదిలో అంతవరకూ లైటువెయ్యలేదని. త్వరగా గదిలోకివెళ్లి లైటువేసి శరత్ "శ్రీకాంత్" తీసి చేత్తో పట్టుకున్నాడు చదువుదామని. ఇంతలోకి వీణనిమీటినట్లే మృదువుగా గానతరంగాలు శేఖర్ వీనులలోనికి జొచ్చుకొని పోయినయ్. ఎక్కడనుండా అని కొంచెంసేపు చెవులు నిక్కపొడుచుకొని విన్నాడు. చివరికి ప్రక్కమేడ గదిలోంచి అని నిర్ధారణచేసుకొని ముందు డాబామీదికి వచ్చి నిలబడ్డాడు. ఇప్పుడాపాట యింకొంచెం స్పష్టంగా విన్పిస్తోంది. ఇందాక రేడియోలో వచ్చిన గీతమే అది. ఆ గది కిటికీ తలుపులు తెరచేవున్నయ్. కిటికీ కెదురుగావున్న పడక కుర్చీలో పడుకొనివుంది యొక పడతి. ఆ లతాంగే ఆలాపిస్తోంది రేడియో గీతాన్ని. ఆ అమ్మాయి బంగారు తీవెలా మెరిసిపోతోంది. సన్నగా, ఎర్రగా సరిపడా పొడవు మనిషి. ఇరవై సంవత్సరాలవయస్సుంటుంది. ఆ విశాల నేత్రాలు, సూదిగానున్న ఆ ముక్కు ఆమె అందంలోని కొన్ని ముఖ్య విశేషాలు. ఎర్రగా మృదువుగానున్న ఆ పెదాలు కదులుతున్నయ్. ఒక్క విషయం మాత్రం చూచినవారిని కలతబెట్టక మానదు. అంత అందంగావుండే ఆ ముఖంలో విషాద రేఖలు గోచరిస్తున్నయ్. శేఖర్‌కి ఆ విషాద రేఖలు చూడగానే మనస్సు కలచివేసినట్లయింది. ఇదివరకా అమ్మాయి నెప్పుడూ చూచివుండలేదు. ఆ అమ్మాయిని చూడటం యిదే ప్రథమం. శేఖర్ యీ యింట్లోకివచ్చికూడా రెండు రోజులే అయింది. ఆలోచించినకొద్దీ ఆమె ఆలాపించే గీతానికీ ఆమె జీవితానికీ యేదో సంబంధం వుండేవుండాలనిపించింది శేఖర్‌కి. కొంత సేపటికా అమ్మాయి ఆ గదిలోంచి వెళ్ళిపోయింది. శేఖర్ తన గదిలోనికివచ్చి ఆలోచించడం మొదలు పెట్టాడు. ఆలోచించినకొద్దీ ఆ అమ్మాయిని గురించి తెలుసుకోవాల నేపట్టుదలయెక్కువయింది. మరునాడుదయం కాఫీవేళకి అనుకోకుండా రమేష్ ఊడిపడ్డాడు.

రమేష్, శేఖర్‌లు ఇంటర్మీడియేట్, బి. ఏ లలో క్లాస్‌మేట్స్. ఇద్దరూ మద్రాసులో చదివారు నాలుగేళ్లూ. తరువాత శేఖర్ యం.బి. బి.యస్.కు విశాఖపట్టణం వెళ్లడంవల్ల, యిద్దరూ విడిపోవలసి వచ్చింది. రమేష్ మద్రాసులోనే బి. యల్. చదివాడు. ఇద్దరి మిత్రుల మధ్యా వుత్తర ప్రత్యుత్తరాలు మాత్రం జరుగుతూండేవి. ఇద్దరూ సమ వయస్కులే. పాతికేండ్ల యువకులు. ఇప్పుడు హఠాత్తుగా రమేష్‌ని చూడగానే జ్ఞాపకం వచ్చింది శేఖర్‌కి రమేష్‌ది యీ వూరేనని. శేఖర్ రమేష్‌తో కరగ్రహణంచేస్తూ

"ఏరా! ఈ మధ్య రెండు మూడు నెలలనుండి వుత్తరాలుకూడా వ్రాయడం మానివేశావే" అన్నాడు.

"ఒరే శేఖర్! నీ కంటే కోపం వస్తుందిగాని నిజంగా చెప్పరా ఎవరు మానివేశారో" అని నిల దీసి అడిగాడు గడుగ్గాయి.

నిజానికి ఆఖరు వుత్తరం వ్రాసింది రమేష్. శేఖర్ ఏదో తొందరవల్లో, లేక బద్ధకంవల్లో గాని వుత్తరానికి జవాబియ్యలేదు. అయినా వీడు యింకొక వుత్తరంవ్రాసి తగలెయ్యకూడదా అని శేఖర్ బాధ.

"శేఖర్! అయితే నీవీ వూరు వస్తున్నావనైనా ఒక కార్డుముక్కరాసి పడేయ్యకూడదూ?"

"అసలు టైమెక్కడుందిరా! ఇలా హౌస్ సర్జన్సీ ఫినిష్ చేశాను-అలా ఆర్డర్సు చేతికొచ్చాయి. ఎక్కువ వ్యవధికూడా లేకపోయింది రాయడానికి. వెంటనే రెండో రోజునే బయలుదేరి వచ్చేశా - ఎలాగో వస్తున్నాకదా అని వ్రాయలేదు. అయితే నీ విక్కడే పెట్టేవన్నమాట ప్రయివేటు ప్రాక్టీసు."

"మా ఫాదర్ సంగతి నీకు తెలుసుగా. నేను మద్రాసులో వుందామనుకుంటే ఆయన పడనివ్వలేదు. సరే నీవుకూడా యీ వూరికే వచ్చావు. చాలా బాగుంది శేఖర్" అన్నాడు తృప్తిగా రమేష్.

శేఖర్ బుర్రలో మెరపులా మెరిసింది ప్రక్కింటి అమ్మాయి. ఆ అమ్మాయి సంగతి అడుగుదామా - వద్దా అనే సందిగ్ధంలో పడ్డాడు. బహుశా రమేష్‌కి తెలిసేవుంటుంది. అడిగితే తప్పక చెబుతాడు కూడా. అయినా అడుగ సాహసించలేకపోయాడు. తరువాత చాలాసేపు వాళ్ల కాలేజీ రోజుల్లో విషయాలు మాట్లాడుకున్నారు. భోజనాలవేళకు రమేష్ శేఖర్ దగ్గర సెలవు పుచ్చుకొని యింటికి వెళ్లాడు. వెళ్తూ సాయంత్రం వాళ్ల యింటికి మిత్రుడ్ని ఆహ్వానించి మరీ వెళ్లాడు. రమేష్ వెళ్లిన తరువాత శేఖర్ భోజనం ముగించి కొంచెంసేపు విశ్రాంతి తీసుకున్నాడు. మధ్యాహ్నం మూడింటికల్లా ఎవరో అపరచితుడు వచ్చాడు నమస్కరిస్తూ. చివరికి తేలిన సారాంశ మేమంటే ఆ వచ్చిన పెద్దమనిషి శేఖర్ అసిస్టెంటు అని తెలియవచ్చింది. శేఖర్ వచ్చిన తరువాత యింతవరకూ హాస్పిటలు చూడనేలేదు. ఆ వచ్చిన వ్యక్తి (పేరు నాగేంద్రబాబు) శేఖర్ని తీసుకువెళ్లి హాస్పిటలు అంతా చూపించి పరిస్థితులను వివరించి తీసుకు వచ్చాడు. అది చాలా చిన్న హాస్పిటలు. మొత్తం బెడ్సు యిరవైకి మించిలేవు. మనస్సులో దానినెంతో పైకి తీసుకురావాలనుకున్నాడు శేఖర్. అచ్చట వున్నది ఒక కంపౌండరూ, ఇద్దరు వార్డుబాయిలూ - ఒక నర్సూను. శేఖర్ హాస్పిటలు నుండి తిరిగివచ్చేసరికి నాల్గుం పావయింది. రమేష్ సంగతి జ్ఞాపకంవచ్చి వెంటనే దుస్తులు మార్చుకొని బయలుదేరాడు. సాయంత్రం షికారుగా నడిచే బయలుదేరాడు. రమేష్ యిల్లు శేఖర్ వున్న వీధి చివర. అక్కడికి వెళ్ళడానికి ఆ ప్రక్కిల్లు మీదుగానే వెళ్లాలి. శేఖర్ తలవంచుకొని నడుస్తున్నాడు. ఆ మేడ ముందుకొచ్చేసరికి తలయెత్తి చూడకూడదనుకుంటూనే ఒకసారి తలెత్తి చూచాడు. అక్కడ యెవరూ కనుపించలేదు. మేడముందు భాగం చాలా అందంగావుంది. ముందు రకరకాల పూల మొక్కలు యిరుప్రక్కలా వున్నయ్. అన్నిటి నిండా రంగు రంగుల పూలు వికసించి కంటికి కింపుగా వున్నయ్. శేఖర్ నెమ్మదిగా నడుస్తూ రమేష్ యిల్లు చేరాడు. గేటుదాటి గుమ్మంలో అడుగు పెడ్తూ ఏదో ధ్వనికి వెనుకకుతిరిగి చూచాడు. ముందు తోటలో పూలమొక్కల మధ్య ఆడుకుంటున్నారు పిల్లలు. అందులో రమేష్ తమ్ముళ్లు, చెల్లెళ్లుకూడా వున్నారు. కేరింతలుకొడ్తూ ఆడుకొంటున్నారు. వాళ్లను చూస్తుంటే మళ్లా చిన్నతనం తిరిగివస్తే తనివి తీరా ఆ ఆనందాన్ని అనుభవించాలనిపించింది శేఖర్కి. శేఖర్కే యేమిటి? మనకు మాత్రం అలా అనిపించదూ! వాళ్లకేబాధ్యతలూ లేవు. మధురమైన మనుగడలో పెరిగే చిందులాట వాళ్లది. పోయే ప్రతిరోజుకీ చిలిపిగా వీడ్కోలిస్తూ, వచ్చే క్రొత్త రోజును అమాయకంగా ఆహ్వానించే మనస్థితి వాళ్ళది. వాళ్లకి అన్ని రోజులూ ఒకేలా వుంటాయి. అందులో ఎంత ఆనందంవుంది! ఎంత మధురత్వంవుంది! నిజంగా బాల్యావస్థ తిరిగి రమ్మంటే మాత్రం తిరిగి

వస్తుందా - ఇంతలోకి అందులో ఎవరోపడిపోతే పిల్లలందరు చప్పట్లుకొట్టి నవ్వటంవల్ల ఆ శబ్దం శేఖర్ని ఈ ప్రపంచంలోకి తీసుకువచ్చింది. అంతవరకూ గుమ్మంలోనే నిలబడినవాడల్లా అప్పుడు రెండడుగులు ముందుకువేసి రమేష్ని కేకవేశాడు. రమేష్ కూడా అప్పుడే టెన్నిస్ రాకెట్ పట్టుకొని యీల వేస్తూ మేడమెట్లు దిగుతున్నవాడల్లా శేఖర్నిచూచి "ఏం! ఇంత ఆలస్యమయిందేం? ఈ వేళ యిక రావేమోనని మీ యింటిమీదుగా క్లబ్బుకు పోదామని బయలుదేరా. అలా నిలబడే వున్నావేం శేఖర్! కమాన్ టేక్ యువర్ సీట్" అంటూ టెన్నిస్ రాకెట్ని బల్లమీదపెట్టి తనూ కూర్చున్నాడు. శేఖర్ రమేష్లు టీ తీసుకున్న తరువాత షికారుకు బయలుదేరి కాళ్ళు పీకట్టేవరకు నడిచి నడిచి చివరికి ఒక మామిడితోటలో కూర్చున్నారు.

"శేఖర్! నిన్నటినుండీ చెప్దామనుకుంటూ నే చెప్పలేకపోయాను; వచ్చేనెలలో నా మేరేజి మా మేనత్త కూతురే. ఇంటరువరకూ చదివిందిలే. పెత్తనమంతా నీదేనోయ్."

"కాకపోతే - మీ మేనత్తవాళ్లు చాలా ధనవంతులని ఎప్పుడో నాకు చెప్పినటు జ్ఞాపకం. మొత్తంమీద చాలా అదృష్టవంతుడివోయ్."

"నా అదృష్టానికేమిగాని. తమ వివాహం ఎప్పుడో మరి! నా పెత్తనం సంగతేం చేశావ్!"

"నా వివాహానికిప్పుడేం తొందరవచ్చింది రమేష్? నిజంగా నాకు పెళ్ళిచేసుకోవడం యిష్టంలేదోయ్?"

"అరరే - అదేమిమాట. ఆడవాళ్లంటే యిష్టంలేదా, లేకపోతే అసలు పెండ్లే యిష్టంలేదా? హఠాత్తుగా ఇట్లా మారిపోయావేమిటి శేఖర్."

"ఏమో. పెండ్లి అంటేనే యిష్టంలేదు. పెండ్లి చేసుకున్న దగ్గరనుండీ లేనిపోని బాధ్యతలన్నీ నెత్తిన పడతాయ్. ఇలావుంటే ఎంత హాయిగావుంది!"

"ఏడిసినట్టేవుంది వ్యవహారం. ఇంతకీ మీ ఫాదర్కి చెప్పావా పెండ్లిచేసుకోనని. అందరి డాక్టర్లకీ విరుద్ధంగా తయారయావేమిటి శేఖర్!"

శేఖర్ మౌనం వహించాడు. చీకటిపడటంవల్ల యిద్దరూ యిళ్లకు బయలుదేరారు.

* * *

మరునాడు వుదయం రమేష్ శేఖర్ యింటికి వెళ్లాడు. ఇద్దరూ యేదో మాట్లాడుకొంటూ వుండగా ఆత్రుతగా ఒక మనిషి పరుగెత్తుకొనివచ్చి నమస్కారం చేశాడు శేఖర్కి. రమేష్ ఆ మనిషిని గుర్తించి "ఏం రామయ్య! ఇలా వచ్చావు?" అని ప్రశ్నించాడు.

"రమేశం బాబుగారూ! మా నారాయణం బాబుగార్కి ఎక్కువగా వుందండి ఇప్పటివరకూ బాగానే వుండారండి. ఇప్పుడే వున్నట్టుండి నిలబడబోయి పడిపోయినారండి మా నళినమ్మ గోరు ఒకటే ఏడుత్తుండారు. నేను త్వరగా ఈ డాక్టరు బాబుగార్ని తీసుకెల్దామని వొచ్చానండి" అన్నాడు.

"అయ్యో! శేఖర్ త్వరగా రావోయ్. ఏదీ నీస్టెతస్కోపు అదీ పట్టుకురా. నువ్వు వెళ్లు రామయ్యా. డాక్టరుగార్ని నేను తీసుకువస్తున్నాలే."

"పద రమేష్-ఆ నారాయణంగారెవరు? వారికెక్కడసలు?"

"మీ ప్రక్కమేడే శేఖర్. ఆయన చాలా ధనవంతుడులే. వారికి ఒక్క అమ్మాయే, ఆమే నళిని. చిన్నప్పటి నుండి ఎంతో గారాబంగా పెంచారు. క్రింద నడవనిచ్చేవారుకారు. ఆ అమ్మాయికి సూర్యరశ్మి ఎలాంటిదోకూడ తెలియదు. అంత అల్లారుముద్దుగా పెంచారు నళినిని. ఆమె యస్. యస్. యల్. సి. చదువుతూండగా వాళ్ల అమ్మ అకస్మాత్తుగా చనిపోయింది. అంతవరకూ దుఃఖమంటే ఏమిటో ఎరగని నళిని దీనికి తట్టుకోలేకపోయింది. అంతవరకూ వున్న ఆనందమంతా మాయమయింది. స్కూలుకు వెళ్ల

మంటే భీష్మించేది. తండ్రికూడ పోనీలే ఆడపిల్లకదా. యస్. యస్. యల్. సి వరకు చదివింది - చాలు లే. యింకా ఎక్కువ చదివితే నుట్టుకు వుద్యోగాలు చెయ్యాలా - అని వూరుకున్నాడు. అప్పటినుండీ నళిని అదోవిధంగా వుంటుంది. సినిమాకి గాని షికారుకి గాని ఎక్కడకీ వెళ్లదు. ఈ నాలుగేళ్లనుండి అదే విధంగా వుంటోంది..." అంటూ ఇంకా యేమో చెప్పబోతున్నాడు రమేష్. శేఖర్ కి మాత్రం ఆ అమ్మాయి పరిస్థితి వినేసరికి నవనీతంలాటి అతని హృదయం కరిగిపోయింది. ఇంతలోకి వారు తోట దాటి లోపల అడుగు పెట్టటమూ, రామయ్య నారాయణరావుగారున్న గదిలోనికి వీరిని తీసుకెళ్లటమూ జరిగిపోయాయి. వారుగదిలో అడుగుపెట్టేసరికి నళిని నారాయణరావుగారి మంచంమీద తల పెట్టి వెక్కి వెక్కి ఏడుస్తోంది. రమేష్ శేఖర్ లను చూచి కన్నీరు తుడుచుకొని తండ్రితలప్రక్కన నిలబడింది. శేఖర్ నారాయణరావుగారిని పరీక్షచేసి మరేమీ ప్రమాదంలేదని రమేష్ కి చెపుతూ నళినివైపుకు చూచాడు. ఆమె ఎంతో ఆత్రుతగా వింటూ ప్రమాదంలేదని తెలిసేసరికి ఒక నిట్టూర్పు విడిచింది. ఆమె ముఖం కొంచెం తేటపడ్డది. రమేష్ అదివరకు నళినితో రెండు మూడు పర్యాయాలు మాట్లాడి వుండటంవల్ల నారాయణరావుగార్కి మరేమీ ప్రమాదం లేదని ధైర్యం చెపుతూ డాక్టరు తనస్నేహితుడేనని పేరు శేఖర్ అనీ పరిచయంచేశాడు. తరువాత శేఖర్ రోజూవచ్చి నారాయణరావుగారిని చూచి పోతూండేవాడు. అతని మందులవల్ల త్వరలోనే కోలుకున్నారు నారాయణరావుగారు.

ఒక రోజు వుదయం శేఖర్ వచ్చేసరికి నారాయణరావుగారు సోఫాలో కూర్చుని పేపరు చదువుకుంటున్నారు. ప్రక్కనే నళిని కూర్చొని ఏదో చదువుకుంటోంది. ఇంతలోకి శేఖర్ లోపలికి అడుగువేయటం, నళిని లేచి నిలబడటం ఒక్కమారే జరిగాయి. నారాయణరావుగారు శేఖర్ ని ఆహ్వానించి నళినిని కూడా పర్వాలేదు కూర్చో అమ్మా అంటూ కూర్చునేటట్లు చేశారు.

శేఖర్ "ఇప్పుడు మీకు ఒంట్లో కులాసా చిక్కిందనుకుంటాను. ఇదివరకటికీ, యిప్పటికీ యేమైనా తేడాకన్పిస్తోందా మీకు?"

"ఆ! ఇప్పుడు చాలా ఆరోగ్యంగావున్నాను. మీచేతి చలవవల్ల ఎప్పటి మనిషి నయ్యాను. మీ రుణం యేవిధంగా తీర్చుకోవాలో తెలియడంలేదు"

"ఎంతమాటన్నారు! అందులో నేను చేసిందేముంది లెండి - భగవంతుని దయవల్ల మీకు త్వరలోనే స్వస్థత చేకూరింది"

"ఇన్నిరోజులుగా మీతో పరిచయం వున్నా తమది యేవూరో తెలుసుకోలేక పోయాను శేఖర్ బాబూ!"

"స్వగ్రామం బెజవాడ. నాన్నగారక్కడే ప్లీడరు."

"మీరేమీ అనుకోకుండావుంటే తమ యావద్విషయాలు తెలుసుకోవాలని కుతూహలంగావుంది. నేనీవిధంగా అడుగుతున్నందుకు వేరేవిధంగా భావించకండి"

"అందులో అనుకోవడానికేముందిలెండి. మేము నాయుళ్లం. మా తలిదండ్రులకు ముగ్గురం సంతానం. మొగపిల్లవాడిని నేనొక్కడనే. మిగతా వారిద్దరూ నా తరువాత ఆడపిల్లలు. ఇంకా చదువుకుంటున్నారు. మా నాన్నగారి నామధేయం రఘునాధరావుగారు. మాయింటి పేరు కిన్నెరవారు."

"తమరి అత్తవారి స్వగ్రామం?"

"నాకింకా పెండ్లి కాలేదు"

ఈ మాటలు వినేసరికి నారాయణరావుగారి ముఖం ఆనందంతో తొణికిసలాడింది. కళ్లు తేజోవంతములైనవి. ఒకసారి నళినివైపు చూచి నిట్టూర్పు విడిచారు. నళిని కిటికీలోంచి కనిపించే పూలమొక్కలవైపు చూస్తూవుంది. ఈ సంభాషణ ఆమె చెవిదూరినట్లే కనుపించడంలేదు.

నారాయణరావుగారు "అమ్మా! కాఫీ తీసుకు రమ్మని చెప్పిరాతల్లీ" అని నళినిని పంపించి "శేఖర్ బాబూ! ఇదేవరస, వాళ్లతల్లి ఎప్పుడు చనిపోయిందో అప్పటినుండి నా చిట్టితల్లి నవ్వుముఖం ఎవ్వరమూ చూడలేదండి. ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూనే వుంటుంది పిచ్చితల్లి" అంటున్నారు. ఇంతలోకి నళిని వచ్చి తండ్రి పక్కగా కూర్చుంది వంటమనిషి కాఫీ తీసుకువచ్చి అక్కడపెట్టి వెళ్లాడు. నళిని కాఫీ కలిపి తండ్రికి, శేఖర్ కి యిచ్చి, తనుకూడా తీసుకుంది.

శేఖర్ నళినినుద్దేశించి "మీ రెప్పుడూ అంత విచారంగా వుంటే నాన్నగారెంత బాధపడుతున్నారో తెలుసా! మీకంటే దురదృష్టవంతు లెంతమంది ప్రపంచంలో వున్నారో మీరాలోచించారా? అందరూ ఇదేవిధంగా వుంటున్నారంటారా? కష్టాలొచ్చినప్పుడు ధైర్యంతో ఎదుర్కోవాలిగాని బెంగతో కృంగిపోతే పెద్దవాళ్లేమవుతారో చెప్పండి" అన్నాడు.

నళిని అంతావిని శేఖర్ వైపు ఒకసారిచూచి తరువాత తండ్రివైపు చూచింది. నారాయణరావు గారు "అవునమ్మా! డాక్టరుగారు చెప్పింది అక్షరాలా నిజం. నువ్వు బాధపడుతోంటే ఈ ముసలి ప్రాణం ఇంకెంత బాధపడుతుందో యెప్పుడైనా యోచించావా తల్లీ! నీకోసమేగా నే జీవించేదికూడా" అని చెమ్మగిలిన కళ్లను తుడుచుకున్నారు. తండ్రి కన్నీరు చూచి జేజారయి "నాన్నా! మిమ్మల్నెప్పుడూ కష్టపెట్టను; నేను సంతోషంగానే వుంటానికనుండి" అంది. "అయితే యేదీతల్లీ! ఒక్కసారి నవ్వు" అన్నాడు పితృప్రేమను ఒలుకబోస్తూ నారాయణ రావుగారు. నళిని మందహాసం వల్ల ఒక్కక్షణ మా భవనమంతా దేదీప్యమానంగా వెలిగింది. ఆమె నవ్వుతూంటే సుందరంగా ఆమెబుగ్గలు సొట్టలు పడుతూంటే శేఖర్ కి ఒళ్లు జలదరించింది; ఆ నవ్వులో ఇంకా ఇంకా ఎంత అందముందో!" అనుకున్నాడు. నారాయణరావుగారు "తల్లీ! ఇక నేను చెప్పినట్లు నడుచుకోవాలమ్మా నీవు"

"అట్లాగే నాన్నా!"

"అయితే పద షికారుకువెళ్దాం. శేఖర్ బాబూ! మీరుకూడారండి" అని బలవంతం చెయ్యడంవల్ల శేఖర్ కి వెళ్ళక తప్పిందికాదు. తిరిగివచ్చే సరికి ఎనిమిదయింది. శేఖర్ సెలవుతీసుకొని వెళ్ళబోతుండగా నారాయణరావుగారు అక్కడే భోజనం చెయ్యమని బలవంతంచేశారు. ముగ్గురూ ఒక్కసారే భోజనం చేశారు. మధ్య మధ్య నారాయణరావుగారు కుమార్తెను నవ్వించాలని విసిరే ఛలోక్తులకు నళిని నవ్వుతూనేవుంది. భోజనానంతరం శేఖర్ సెలవు తీసుకొని యింటికి వెళ్ళాడు. ఇలా కాలచక్రం ఇంకా కొంచెం ముందుకు దొర్లింది.

నళిని శేఖర్ తో ఎంతో చనువుగా వుంటోంది. అయినా శేఖర్ వుండేది ప్రక్కయింట్లోనే అని ఇంతవరకూ తెలుసుకోలేక పోయింది.

అవి వెన్నెల రాత్రుళ్లు. ఒకరోజు మామూలుగా నళిని రేడియో ట్యూనుచేసి ఏవోపాటలు వస్తూంటే వింటూ ముందుడాబా మీద తిరుగుతోంది. ఇంతలోకి రేడియోలో "ఏమగునో నా హృదయనావా" అంటూ విన్పిస్తోంది. నళిని లోనకువెళ్లి దానితో తన కంఠంకూడా కలిపి పాడటం మొదలుపెట్టింది. ఆ పాట పూర్తయిన తరువాత ఆపాటే ఆలాపిస్తూ గుమ్మాని కానుకుని చంద్రుడ్ని తిలకిస్తూంది. ఇంతలోకి ప్రక్కమేడ మీద లైటు వెలగటంవల్ల అటువైపుచూచింది. శేఖర్ నళినివైపే చూస్తున్నాడు. వారిరువురి కళ్లూ కలిసాయి. ఆమెకు సిగ్గువేసి లోపలికి పరుగెత్తుకొని పోయింది.

ఒక రోజు నారాయణరావుగారు శేఖర్ తో పెండ్లి విషయంయెత్తారు. శేఖర్ "ఇప్పుడేం తొందర లేండీ నాకు" అని తలవంచుకున్నాడు. కాని నారాయణరావుగారు అంతటితో వదిలేమనిషికాదు. అందులో ఒకే కులం, రూపసి. మంచికుటుంబంలోవాడు; విశేషంగా డాక్టరు చదివినవాడూ. అలాంటి అల్లుడు ఎంత ధనవంతుడైనా తనకి దొరకటమే దుర్ల

భమనిపించింది. శేఖర్‌కి నళిని నివ్వటాని కుద్దేశపడు తున్నట్లు సూచించాడు. శేఖర్ మందహాసంతో తల వంచుకున్నాడు. ఆ మందహాసం వికసించిన బొడ్డుమల్లె మాదిరిగావుంది. నారాయణరావుగారు శేఖర్ తల్లి దండ్రులవద్దకు తగు మనుష్యులను పంపి అంతయు సిద్ధంచేశారు. వారుకూడా సుముఖులుగా వుంటంవల్ల ముహూర్తంకూడ త్వరలోనే నిశ్చయమయింది. ఒక రోజు రమేష్ సంగతంతా తెలిసికొని "పెండ్లంటేనే యిష్టంలేదా? అరె వింతవింత!" అంటూ దెప్పిపొడి చాడు. జవాబుగా శేఖర్ ఒక చిరునవ్వుమాత్రం విసిరి ఏదోపని వున్నవాడిలాగ అక్కడనుండి తప్పు కొనేవాడు. కొద్దిరోజుల వ్యవధిలోనే రమేష్ శేఖర్‌ల వివాహాలు ఎంతో వైభవంగా జరిగి పోయాయి. పెండ్లినాటి రాత్రి శేఖర్ క్రింద మిత్రులతో ముచ్చటిస్తూవుండగా నళినిమేడమీద రేడియో ట్యూను చేస్తూ కూర్చుంది. రేడియో అంటే అంత ప్రాణమామెకు! రేడియోలో యీమారేవో పాటలు వస్తున్నాయ్. నళిని కూనిరాగాలు తీస్తూ డాబామీదకువెళ్ళి పిట్టగోడ కానుకొని నిలబడి చంద్ర బింబాన్ని తిలకిస్తోంది. ఆ చంద్రకాంతిలో ఆమె సుందర ముఖారవిందం మరెంత అందంగా తయా రయింది. ఆమె ఫాలముపై తీర్చిదిద్దిన కల్యాణతిలకం నూతన వధువును పరిచయంచేస్తోంది. ఆమె పెదవుల మీద అనిర్వచనీయమైన చిరునవ్వు నాట్యం చేస్తోంది. చందుడ్ని చూస్తూ ఆమె ఈలోకాన్నే మరచిపోయి శేఖర్ వచ్చిందికూడా గమనించ లేకపోయిందామె. శేఖర్ రేడియోగీతంలో తన కంఠాన్ని కలిపి "అందమె ఆనందం" అని పాడుతూంటే ఆ గీతంలో తన కంఠం కూడా మేళవించి ఆలాపించడం మొదలుపెట్టింది. శేఖర్ వామ బాహువు ఆమె సన్నని నడుమును చుట్టివేస్తూంటే ఆనూతన వధువు సిగ్గిలి చటుక్కున అతని బాహువల్లరిలో నొరిగిపోయింది.





# స్త్రీ విద్య

శ్రీ సాధన వీరాస్వామి నాయుడు, యం. ఏ.

పురుషు నొక్కని విద్యాప్రపూర్ణుఁ జేయ
జాతికంతకు నొక్కఁడే చదివినట్లు
వనిత నొక్కర్తు విజ్ఞానవతిని జేయ
కాఁపురంబంతకుఁ జదువు కలిగినట్లు.

చదువుకొన్నతల్లి చల్లని కడుపులో
పుట్టినట్టి పట్టి బోలు నెవరు ?
విద్య నీతి శీల విజ్ఞానవంతుఁడై
దేశసేవ జేయు ధీరుఁడగును.

ముప్పదాఱుకోట్ల మూల బలగములో
నక్షరాస్యులు పదునైదు శాత
మందు స్త్రీలసంఖ్య యత్యంత స్వల్పంబు
చెప్పికొనఁగ నేల సిగ్గుచేటు !

పల్లెటూళ్లమయము భారత దేశంబు
బీదతనము, వ్యాధిపీడ, కఱవు
గజ్జ కట్టి యాడు గ్రామసీమ లెటుల
వృద్ధిఁ జెందు స్త్రీకి విద్యలేక ?

భావిభారత వీరులఁ బడయు తల్లి
బెబ్బులి సమరమూర్తుల వీరపత్ని
విద్య నేర్చుకొనుట తన విధి యటంచు
తలఁచినప్పుడె దేశంబు ధన్యమగును !

పల్లెటూరి గరితఁ బఠియింపఁ జేసిన
దేశగౌరవంబు దీ[illegible]కొనును
సాంఘికార్థికాది జటిల సమస్యల
స్త్రీల చదువు చక్కఁ జేయఁగలదు.

ధీరుఁడౌ శివాజీఁ దీర్చి దిద్దిన తల్లి !
పౌరుషుం బతిఁ బంపిన వీరపత్ని !
రాజ్యమేలిన రామరుద్రాంబ యెవరు ?
చదువుకొన్నట్టి గృహలక్ష్మి సాటియెవరు ?



# చిరునవ్వు

పోలాప్రగడ శ్రీ వెం. స.

"కమలా! నావయసు చిన్నదే అయినా నేను అందాల భరిణనే అయినా నాలో ఎంత ఆకర్షణ ఇమిడివున్నా నా హృదయాన్కి శాంతిలేదు. సర్వ సౌఖ్యాలు అనుభవిస్తూ ఆనంద సామ్రాజ్యాన్కి పట్ట మహిషిని కావలసిన దానను. ఇలా తయారయాను. ఈ వయసులో ఎంతమంది ఎంత ఆనందాన్ని అను భవిస్తున్నారో! తలుచుకుంటే హృదయం బరువెక్కి పోతుంది. నా హృదయం ఏనాడో మోడుబారి పోయింది. ఇక నాకీజీవితంలో లేశంకూడా ఆనందం లేదు." అంటూ మోహిని బొటబొటా కన్నీరు కారుస్తూ! నాభుజాలమీద వాలేసరికి నాహృద యాంతరాళాల్లోనుంచి ఏదో దయ నాకు తెలియ కుండా ఆవిడను ఓదారుస్తోంది -"లే మోహినీ చిన్న దానిలా ఇల విలపిస్తావేం! నీవా పెద్ద వుద్యోగి భార్యవి-నీవు విలపించడం దేనికి" అని అతి లాలనగా నేనడిగేసరికి ఆవిడవిచారం మరింత తీవ్ర రూపం దాల్చింది. "కమలా నాకీ ప్రపంచకంలో ముగ్గురేవున్నారు తల్లి, తమ్ముడు, నీవు - నా విషాదగాథ నీతో చెప్తే కొంత మనశ్శాంతి కలుగుతుందేమో! విను." అని కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ తన సాహస విషాధగాధను ఇలా చెప్పడం మొదలు పెట్టింది. ఆ హృదయం ఎంత పరితాపాన్ని అనుభవిస్తోందో! ఎంత దుఃఖిస్తోందో దగ్గరున్న నేనే అర్థం చేసుకోలేక పోయాను."కమలా విను! నా విషాదగాథ విను" నా జీవిత కుసుమాన్ని ఎలానులుంపుకున్నానో విను "అని మోహిని ఉద్రేక పూరితంగా మాట్లాడుతూవుంటే నావళ్ళు జల దరిస్తోంది. ఏమిచేయాలో తెలీక నిశ్చేష్టురాలవయి అలాగే వింటున్నాను.

"మాది కొవ్వూరు. ఒకానొకప్పుడు-అంటే నేను 2,3 సం॥ వయస్సుకలిగినపుడు మాకుటుంబం అనంత సౌఖ్యాలను అనుభవిస్తూ వుండేదిట మానాన్నగారి దురభ్యాసాలవల్ల వున్న ఆస్తిఅంతా ఖర్చుచేశారు. చివరకు అమ్మా, నేను నా చిట్టితమ్ముడూ, నాన్నా మిగిలాం. నాన్న ఈ దుర్భరదారిద్ర్యాన్ని కౌగిలించు కోలేక పలాయనం కావించాడు. ఆ నాటికీ ఈ నాటికీ ఆయన జాడ తెలియదు.! మేము తిండాన్కి తిండికికూడా మొహంవాచాము! ఆ పరిస్థితులలో మేమేంచేయాలో మా అమ్మకు అర్థంకాలేదు. ఆ సమయంలో మా అమ్మ తమ్ముడు ఒకడు రాజమండ్రీలో వున్నాడని జ్ఞాపకాన్కి వచ్చింది. ఆ పరిస్థితిలో అంత కన్నా నాఅన్నవాళ్ళు మా అమ్మకెవరూలేరు. అప్పటికి నాకు 6 వ సం॥ అను కుంటాను.విధి లేకనన్నూ, నా రెండేడ్లతమ్ముని తీసుకొని తమ్ముడిగారింటికి రాజమండ్రీ బయలుదేరింది!

ఎంత దగ్గరవాళ్ళయితే మాత్రం ఎన్నాళ్ళు పోషిస్తారు. కొన్నాళ్ళకు విసుగులు,కసురులు బయలు దేరాయి. "మరణమపాత యాతనా వహము; దారి ద్ర్యము యావజ్జీవితము తీవ్రవేదనాకరము" అనే మిత్రలాభంలోని మాట ముమ్మాటికి సత్యం! జీవి తానికి ఎన్ని బాధలు కలిగినా, సుఖాలుకలిగినా! కాలంగడచిపోతూనే వుంటుంది. మాకు వేరేగతిలేక చాకిరీచేస్తూ అలాగే నాకు 13 సం॥లు వచ్చేదాకా గడిపాము.

నాకు వివాహంచేద్దామని మా అమ్మకు వుద్దేశ్యం వుండేది. దరిద్రునకు కోరికలు ఎక్కువన్నట్టు తిండానికే-తిండిలేక మలమలమాడుతూ, చాకిరీచేస్తూ ప్రపంచంలో లేని తిట్లు పడుతూ, చూస్తూ చూస్తూ ప్రాణాలు తీసుకోలేక కడుపుకోసం పడరానిపాట్లు పడుతూ, జీవించడమే మహాకష్టంగావున్న కాలంలో నాకు వివాహం చేయాలని సంకల్పించుకోవడం ఆశ్చర్యమే! అయినా మాతృహృదయంకాబట్టి అలా కోరుకోనడం ఒకవిధంగా సమంజసమే! ఏది ఏలా గయినా నా అందాన్కి సరిపడ్డవాడురాడు. 'నా

అందానికి నేనే గర్విస్తాను. నా అందం బూడిదలో పోసిన పన్నీరయిందని నేనే దుఃఖిస్తాను.'

ఈ పరిస్థితులు ఇలాగున్న కాలంలో మా వూళ్లో నే పెద్ద వుద్యోగి-అంటే ప్రస్తుతం మా ఆయన. ఈయనకు ఆరుగురు ఆడపిల్లలు ముగ్గురు మగపిల్లలూ; ఈయన మొదటి భార్య చనిపోయింది. ఆ ముసలిపండుకు వివాహం చేసుకోవాలని సంకల్పం.

ఒకనాడు ఆయన మా యింటికి వచ్చాడు. తనకు పెళ్ళిచేసుకోవాలని వుందనీ, తనకు భూవసతిలేదనీ రొఖ్ఖంమాత్రం వుందనీ: ఇష్టమయితే నన్ను వివాహం చేసుకుంటాననీ అన్నాడు. ఈ పరిస్థితులలో నేనేం చేయాలి! ఆయనకు ఇవ్వడాన్కి మామావయ్యకు ఇష్టంలేదు. ఎప్పుడూ ఇలా పరాయి వాళ్ళ ఇంట్లో దాస్యంచేస్తూ కడుపునిండా అన్నంలేక వుండనా లేక, ఆ ముసలివానిని పెండ్లిచేసుకొని నేను కడుపునిండా తిని మా అమ్మ, తమ్ముడినీ సుఖపెట్టనా?

ఏదో ఒక మూల తిండితిప్పలు లేక బాధ పడుతూ వున్నా నాయావ్వన సౌందర్యాలు సార్థకంగావు; ఇక ముసలాయన దగ్గరవున్నా అంతే!— ఇంతకూ, ఆయన్నే పెండ్లిచేసుకొని పది సంవత్సరాలపాటు సరిఅయిన తిండీ, మంచిగుడ్డా ఎలాగుంటాయో తెలియని మా జీవితాలకు వాటిని రుచిచూపాలనుకున్నాను. నా సౌందర్యయవ్వనాలను మమ్మల్ని ఆవహించిన కటికదరిద్రానికి బలిచేయవలసిందే! అప్పుడు గాని దరిద్రదేవత మమ్మల్ని వదలదు. ఏదిఏమయినా సరే కడుపునిండా తిండీ, వంటినిండాగుడ్డా పెట్టే మహానుభావుడు ఆయనే అనుకున్నాను - ఆయన్నే వివాహంచేసుకుందామని నిశ్చయించుకున్నాను.

వివాహమయింది. కాపరాన్కికూడా వెళ్ళేను. సుందరమయిన పెద్దభవనం చూచేటప్పటికి ప్రశాంత వాతావరణం లభించదని విచారపడ్డాను. ఏంపాపం చేసానో కమలా! తిండికీ గుడ్డకూ కరువులేక పోయినా! నా మనస్సుకు శాంతిలేదు. మా ఆయన గార్కి ఆరుగురు ఆడపిల్లలు, ముగ్గురు మగపిల్లలూను. దాన్నిబట్టి ఆయనకు ఎంత వయస్సుంటుందో ఒక్కసారి వూహించు. ఈయన తల్లికూడా బ్రతికేవుంది-చాలా ముసలిది. అబ్బబ్బా ఆ విడ పెట్టే తిప్పలు ఇన్నీ అన్నీ కావు! ఆవిడ బాధ భరించడం చాలా కష్టమయిపోయింది. చాకిరంతా నేనే చేయాలి. 'స్వర్గానికి వెళ్ళినా వడాకులు తప్పాయికాదురా భగవంతుడా'అనుకునేదాన్ని. ఇంకాయన పెద్ద కూతురు వుంది. ఆమె బి. ఏ. చదువుతోంది. నవీన సాంప్రదాయాల్లో తానే ఆరితేరానని మహా గర్వం. అరటికాయ ముక్కలు వేపి అక్కడ పెడితే 'వేసుకున్నన్ని వేసుకొని, తినగా మిగిలినవి మళ్లీ ఆ ముక్కల్లో పారేసిపోయేది. ఈ విధంగా ఎంగిలికూడుకూడా తినవలసివచ్చింది. ఇందుకేనా నా యవ్వన సౌందర్యాలను బలిచేసింది. ఏదో సుఖిద్దామని నేనువస్తే అంతకంటే యమయాతనలా! నా హృదయం బరువెక్కింది ఏదో ఆవేశం నా శరీరాన్ని ఆవహించి; నాలో యౌవ్వనపు రక్తం పొంగి పొర్లింది. ఛీ, ఇంతాచేసి ఈ ఎంగిటిక్కూటికిఆశపడ్డం నచ్చిందికాదు. తక్షణం మా ఆయన దగ్గరకు వెళ్ళాను. పరిస్థితులు చెప్పాను. వేరే కాపురం పెడితేగాని వప్పుకోనన్నాను. పెంకిపట్టుపట్టాను. నా కోరిక ఫలించింది. ఆయన తల్లిని, కొడుకులను, కూతుర్లను వేరే పెట్టారు. ఆయన, నేనూ, అమ్మా, తమ్ముడూ ఒక చోట వుంటున్నాం. అయినా ఈ హృదయాన్కి శాంతిలేదు. ఆయన విపరీత చర్యలుచూస్తే ఇక ఈయన పోయిన తర్వాత అడుక్కుతినే పరిస్థితి వస్తుందేమోనని భయపడ్డాను. దీపం వుండగానే ఇల్లు చక్కబరుచుకోవాలన్న జ్ఞానం కలిగింది ఒకనాడు. ఆయనతో చదువుకోవాలని వుందన్నాను. ఆ దెబ్బతో తారాచువ్వలాగా లేచారు. నన్ను దూషించారు. ఆడవాళ్ళకు చదువేంటన్నారు? నోటికిరాని దుర్భాషలాడారు. కాని నేను పట్టిన పట్టు విడువలేదు. నేను చదువుకుంటానన్నాను. ఆ యేడల్లా హిందీ ప్రవేటు చెప్పించుకొన్నాను. ప్రాథమిక పరీక్ష ప్యాసయ్యాన్ను. మధ్యమ చదువుతున్నాను. ఆయన ముసలాయన. ఇంకెంతో కాలం

వుండరు. ఆయన వుండగానే ఏ హిందీయో నేర్చుకుంటే తరువాత వాళ్లుమాచివా చూడకపోయినా నా లెక్కలు వాళ్లొస్తాయని వూహించాను. అతి సాహస కార్యాన్కి పూనుకొన్నాను. నేను మేజస్ట్రేటు భార్యనయివుండీ రోజూ కాలినడకను "వీరభద్రపురం"లోని హిందీ స్కూలుకు వస్తున్నానంటే ఆయన మనస్తత్వం—వూహించుకో. ఇదే నా పరిస్థితి ప్రస్తుతం నేను ఇలాగున్నాను" అని మోహిని నాతో చెప్పి వెక్కి వెక్కి ఏడ్వటం మొదలు పెట్టింది. "పిచ్చిదానా కష్టాలు అనుభవిస్తేనేకాని సుఖంలో వుంటే మజా తెలియదు."

"కమలా ! కష్టాలు పోవాలంటే ఎలా ?"

"తరచు కష్టాలు రావాలి."

"అవును అలాగ వచ్చిననాడే కష్టాలు పోతాయి. చాలా టైం అయినట్లుంది. మోహినీ! ఇక నేను వెళ్తా"నంటూ లేచాను.

"మళ్ళీ ఎప్పుడొస్తావు ... ?"

"సాయంత్రం !"

"తప్పక రావాలి !"

"అలాగే."

♦ ♦ ♦

కమల జీవితం చాలా విచిత్రమయిందని నేనే చెప్పాలి. ఎందుకంటే నేను ఆమెకు తమ్ముణ్ని. నేనుండేది ఇంకోవూరయినా ఆ నాడు రాజమండ్రీ మా అక్కయ్యగారింటికి వెళ్లాను. పైగొడవంతా మా అక్క నాకు చెప్పిందే. ... ... ... ఆ రోజు సాయంత్రం ! మా యింటిముందర (అంటే మా అక్కయ్యగారింటి ముందర) ఎవరో యువతి ఆగింది. "కమలా ! కమలా !" అని పిలుస్తోంది. మా అక్కయ్య లోన వంటచేస్తోంది ! మా బావ బజారు లోకివెళ్ళాడు. నేను వెళ్ళి "ఎవరండి మీరు" అన్నాను ధైర్యంగా.

"నేనెవరయితే కానీండీ, లోపల కమలవుందా" అంది.

"ఆ వుందండి ! కేకవేయమంటారా."

"నేవేరే చెప్పాలా - ?"

"చాలా చమత్కారంగా మాట్లాడుతున్నారే!"

"అనవసరపు సంభాషణ ఆపుచేయండి ! ఆవిడని కేకవేస్తారా-నేవెళ్ళిపోనా" అని అడిగింది.

ఒక్కసారే ఛీ అందని విచారించాను. అంతలోకే అంత అందమయిన పిల్లచేత "ఛీ" అనిపించుకోవడమే పదివేలని సంతోషించాను. ఆ అందాన్ని చూస్తూవుంటే ఏ యువకునకును హృదయం చలించదు? పొడవయిన ఆ ముంగురులు, పాలరాతిలా నీడ ప్రకాశిస్తోంది. నునుపుగావున్న ఆవిడ మొహం మీదవున్న చారెడేసికండ్లూ ! ఆ వక్షోజాలబిగువూ ఆ అవయవ పొందికా ! ఆహా ! సౌందర్యానికి ఇదే పరిమాణమని తెలియచేయడాన్కి బ్రహ్మ సృష్టించాడేమోనన్న భ్రమ ఆమెను చూచిన ప్రతి పురుషునకు కలుగుతుంది. ఇటువంటి ఆలోచనతో ఆ విడ అందాన్ని గురించి ఆలోచిస్తూ నన్ను నేనే మరచిపోయి పెద్ద పెద్ద వూహాసౌధాలు నిర్మిస్తూవుంటే మా అక్కయ్య వచ్చినట్లు నేనేం చూస్తాను ? నా ఆనందం నాది. "ఏమిరా అలా నిలబడి ఏంటి ఆలోచిస్తున్నా"వని మా అక్కయ్య నన్ను ప్రశ్నించేదాకా అయ్యో నేను మానవుణ్ణి, నాకు మానవులతో సంబంధంవుంది ! అన్న సంగతి జ్ఞాపకంవచ్చింది కాదు. "అబ్బే ఏమిలేదు" అన్నాను. నా సమాధానానికి 'మోహినికాదు'-'జగన్మోహిని'చిరునవ్వు నవ్వింది.

♦ ♦ ♦

ఒక్కొక్క కాలంలో జరిగినపని జీవిత సమస్యగా దారితీస్తుంది ! ఆ చిరునవ్వే ఈ నాటి పరిచయాన్కి కారణం ! ఆ చిరునవ్వే మమ్మల్ని కలిపింది. ఆ కల్మషంలేని అకారణపు చిరునవ్వే మా ఇద్దరి ఆనందానికి కారణభూతమయింది.

ఏనాడయితే ఆ దివ్య మంగళ విగ్రహాన్ని చూచానో ఆ నాడే నాలో ఏదో అనిర్వచనీయ

మయిన బాధ నన్ను మతిమాలినవానిగా చేసింది. పుస్తకం ఇచ్చుతే "మోహిని" అన్నం తింటే మోహిని! ఒకటేమిటి సర్వకాల సర్వావస్థలయందు నాకు మోహినీ స్మరణ అయిపోయింది! మా అక్కయ్యగారింటిదగ్గర రెండు రోజులు వుందామని వచ్చినవాడిని, మా అక్కయ్య వెళ్ళిపొమ్మని అనేదాకా వుందామని నిశ్చయించుకున్నాను. "మోహిని" రోజూ ఏదో పైపనిమీద మా యింటికి వస్తూవుండేది. ప్రతిరోజూ నేను ఆవిడ రాకకోసం ఎదురుచూచేవాడిని. అనవసరంగా జోక్యం కలుగచేసుకొని మాట్లాడేవాడిని. ఏదో పని కల్పించుకొని ఆవిడ ఎదురుగుండా పదిసార్లు తిరిగేవాడిని. మోహినిని మోహించడంలో పెద్ద అతిశయం లేదుగా. ... ... ... ... ... ... ...

ఆ రోజు సాయంత్రం ఆవిడ వచ్చింది. ప్రియురాలి రాకకోసం ఎదురు చూస్తున్న నా హృదయారాటం చల్లారింది. తిన్నగా ఆవిడ మా అక్కయ్య దగ్గరకుపోయి సినీమాకు వెడదామంది. మా అక్కయ్య సరేనంది. మా బావ వూళ్ళోలేడు. నువ్వుకూడా వస్తావా అంటూ నన్ను అడిగింది. మహాభాగ్యం అన్నాను. ఆవేళ మేం ముగ్గురం సినీమాకు బయలుదేరాము. ఇంకా ఇంటర్‌వల్ కూడా కాలేదు. మా అక్కయ్యకు కడుపులో నొప్పులు ప్రారంభించాయి. ఒక్క క్షణంహాల్లో కూచోలేకపోయింది. 'ఇంటికి వెళ్ళిపోతాను. మీరు వుండండని' చెప్పి రిక్షా కట్టించుకొని ఇంటికిపోయింది. ఆవిడా నేనే మిగిలినందుకు చాలా సంతోషించాను. ఆవిడ అందాన్ని అవలోకిస్తూ అనుభవిస్తున్నాను ఆనందాన్ని. సినీమా అయిపోయింది. ఎవరిదారిన వారు పోతున్నారు. లేస్తారా ఇక పోదాం అన్నాను. ఆ అంటూలేచి పదండని ఒక చిన్న చిరునవ్వు పారేసింది. ఆ చిరునవ్వే మన్మధుని అరవబాణం అనక తప్పదు. రిక్షామీద పోదాం అంది. రిక్షామీద వెడితే దబ్బున వెడతాం ఏమో అని నడచిపోదామన్నాను. సరేనంది. ఇద్దరం నడచిపోతున్నాం ఆవిడ చూడనప్పుడు నేనూ! నేను చూడనప్పుడు ఆవిడా ఒకరొన్నకరు చూచుకుంటూనే వున్నాం. ఆఖర్కి తెగించి 'మీరు చాలా అందంగా వున్నారండీ' అన్నాను.

"ఎందుకొచ్చిన అందంలేండి! బూడిదలోపోసిన పన్నీరు! అడవిని కాచిన వెన్నెల."

"ఆ పన్నీరుని వుపయోగించుకోవడంలోవుంది! అది పట్టుకుపోయి బూడిదలోపోసేబదులు ఏ మనిషి మీదనో చల్లండి అప్పుడు సార్ధకం అవుతుంది"

"చాలా లోతుగా మాట్లాడుతున్నారు. అయినా-చల్లినా! చల్లించుకొనేవారు వుండొద్దూ!"

"లక్షలు! కోట్లు! చల్లించుకొని శాశ్వతంగా ఆనందం అనుభవించేవాళ్లున్నారు?"

"అలాంటి వారెవరు?"

"మీరు మరోలాభావించకుండావుంటే. నే... నే"

"ఆ!"

'క్షమించాలి. పొరబాటుగా మాట్లాడానేమో!

"పొరపాటేమిటిలేండి! అది సహజం!"

"మీరు ఏదో పరాకున మీ ఇల్లుదాటి వచ్చేసారు. మరోసారి మాట్లాడుకుందాం!"

"చూచుకోలేదు! క్షమించండని!" తిరుగుమొఖం పట్టాను. ఇంటికి పోయేసర్కి మా అక్కయ్యకు జ్వరము! ఆ రాత్రంతా "మోహిని" భార్యగా అయితే ఎలాంటి సుఖం అనుభవిస్తానో ఆలోచించుకుంటూ తీయని కలలుకంటూ గడిపాను.

మర్నాడు మా అక్కయ్యకు జ్వరం తగ్గింది!

... ... ...

పిడుగులాంటి వార్తవినేసరికి ఒకందుక్కి సంతోషం మరొకందుకు విచారంకూడా కలిగింది! మోహిని భర్త ముసలాయన చనిపోయాడు. వెళ్ళాం, చూసాం; కాస్సేపుకూర్చుని వచ్చేసాం; మోహిని మాత్రం విచారపడడంలేదు; మామూలుగానేవుంది.

... ... ...

అది శరత్ పూర్ణిమ. ప్రశాంతమయిన గాలిలో తేలి ఆడుతున్నాను. సుమారు రాత్రి 7 గం॥ అయి వుంటుంది! మోహిని వచ్చేసింది ఇంత అమర్దాగా వచ్చిందేమా అనుకున్నాను. మా అక్కయ్యతో గుసగుసలాడింది. ఆవాళ అక్కడే పడుకుంది!

తెల్లవారేక మా అక్కయ్యను రాత్రి ఆమె ఎందుకు పడుకుందిక్కడని అడిగాను. మోహిని వాళ్ళతో దెబ్బలాడి ఆస్తిపంచుకొందనీ, 4 వేల రొక్కం ! 1 వడ్డాణం, 1 కంటె, 4జతల గాజులు వచ్చాయని అవి దాయడాన్కి మనింటికి వచ్చి ఇక్కడేపడుకొంది అని చెప్పింది!

నాలో అనేక వ్యూహాలు బయలుదేరాయి. నేను కూడా ఒక సంఘసంస్కర్తనవుతానని ఆశించాను. ఆవిడ అందాన్కి దాసుణ్ణి ఆయాను. ఆమే నాజీవితాన్కి వెలుగు. ఆమె నాకు సర్వం. ఆమెలేనిదే నేను జీవించలేను. నానాటికి మా ప్రేమవర్ధిల్ల సాగింది! ఈ విషయం మా అక్కయ్యకు, మా బావకూ కూడా తెలిసింది. మా ఇద్దరి అభిప్రాయాలూ కనుక్కొని ఒకమంచి రోజున రిజిస్టర్డ్ మేరేజ్ చేసారు

మరి కొన్నిరోజులకు మేము వేరే కాపరం పెట్టాం; మా అత్తగారు, మా బావ భీమవరంలోవుంటున్నారు. అక్కడ మా బావ చదువుతున్నాడు. ఈ నాడు ఇన్ని సౌఖ్యాలు అనుభవించడాన్కి గల కారణం ఆ చిరునవ్వేకదూ !

# శాంతి దేవతా!

శ్రీమతి జి. రాఘవమ్మ

అదిగో చూడుము
ఆశాజ్యోతిని
దిగమ్రింగినదొక
అణుకిరణం
శాంతికాముకత
చేష్టలలో శూన్యం,
శాంతిదేవతా!
శోక మదేలా?
శయనించుమ
స్మశానపథాన.
అదియొక
అగాధ సముద్రం
అశ్రు బిందువుల
పానీయం
ఆర్తానాదపు
తరంగఘోష
ఆకటితో జీర్ణించిన
అసాధ కంకాళ
మత్స్య సంతతి
అణుకిరణపు
బడబానల జ్వాలలతో
ఘూర్ణిల్లెడి
సంగ్రామసముద్రం,
శయనించుమ
శాంతిదేవతా!
మానవ నిర్మిత
మారణాస్త్రముల
మరణశయ్యపై.

ధనవంతుల
స్వార్థకాంక్ష
ప్రపంచజీవిత
పరమావధులను
కదలించెను
సడలించెను

దయచేయుము
శాంతిదేవతా!
ప్రపంచప్రజల
దృష్టిదాటి.

ప్రపంచశాస్త్రపు
ప్రజ్ఞాఫలితం
నీ శిరమున
అహో కిరీటం
పరమాణుల
విద్యాగర్వం
నీహృదయానికి
వజ్రాఘాతం
దారిద్ర్యపు
నగ్ననాట్యం
నీమరణానికి
అంపశయ్య

మరణింపగ
వాంఛింపగ
మనసగు చుండినదా?
శాంతిదేవతా!

# ఆంధ్ర జానపద గేయవాఙ్మయ చరిత్ర

## కాంభోజరాజుకథ (క్రీ. పూ. అయిదవ శతాబ్దం)

శ్రీ ఏటుకూరి కామేశ్వరరావు

కాంభోజరాజుకథ ఒక జంగంకథ. ఇది చంపువు. కాబట్టి దీనిలో గేయం, వచనంకూడ ఉన్నాయి. ప్రతి చరణం చివర 'తందాన' అనేది ఊతపదం. ఇదొక రాజు కథ.

### కవి

ఈ కథను జంగం సుబ్బయ్యదేవర రచించినట్టుగా గేయం చివరఉంది. దానిని శోధించవలసుంది.

ఈ కథలోని అంతస్సాక్ష్యాలనుబట్టి ఇది క్రీస్తు పూర్వపు రచన అని తెలుస్తూంది. జంగం సుబ్బయ్యదేవర అను పేరు వీరశైవ మతానికి సంబంధించినది. బసవేశ్వరుడు క్రీ. శ. 1150 ప్రాంతంలో వీరశైవ మతాన్ని స్థాపించేడు. కాబట్టి ఎప్పుడో జరిగిన కథను జంగం సుబ్బయ్యదేవరకి ముడిపెట్టడం సబబుకాదు. కాబట్టి అది ఈ కథను అచ్చువేయదలచినపుడు పాడిన పాటగాడిపేరు అని మాత్రమే చెప్పవచ్చు.

### జంగం కథ *

కర్తయొక్క పేరుకంటె ముందు చర్చించవలసిన అంశం మరొకటుంది, అదేమంటే - జంగంకథ అను పద సంపుటి. కాంభోజరాజుకథ ఒక జంగం కథ కదా! జంగాలు ఏర్పడ్డాకే జంగం కథలు పుట్టి ఉండాలి. ఆ పక్షంలో కాంభోజరాజుకథ క్రీస్తు పూర్వపుకథ ఎట్లాగవుతుంది? ఇదొక పెద్ద సమస్యకాదు. పూర్వకాలంనుంచి పాటలుగా వస్తూన్న కథలను ఇటీవలి జంగాలు పాడుతూ వచ్చేరు. వీరు విరివిగా పాడడంవల్ల వీటికి జంగం కథలను పేరు వచ్చింది. కాంభోజరాజు కథా కాలానికి ఇట్టి రచనలకు తెలుగులో ఏమి పేరుండేదో మనకు తెలియదు. కాని సంస్కృతంలో మట్టుకు ఇట్టి వాటికి ఆఖ్యానాలు అని పేరు.

ఈ జంగం కథల తత్త్వమేమంటే - ఇది జరిగిన కాలానికి బహు సమీపంలోనె రచనకూడ పుడుతుంది. కథలో అంశాలు కొత్తగా జరగడంవల్ల ఉత్తేజకరంగా ఉంటాయి. ప్రజల మెప్పును పొందుతాయి. ఆ కథంతా కవిరచనలో అధిక సంప్రదాయాలతోకూడి కళారూపాన్ని పొందుతుంది.

కథా స్థలంలో ఉండే మనిషికే ఆ సంఘటనలన్నీ బహు ఘనంగా కనబడతాయి. స్థానిక వ్యక్తికి భూగోళ శాస్త్రం తెలిసుంటుంది. కథా వీరులనుకూడ ఎరిగుండే అవకాశముంది. ఇట్లు కథా కాలానికి, రచనా కాలానికి చెప్పదగిన భేదముండదు.

ఎప్పుడో జరిగిన కథను తీసుకొని కవి జంగం కథగా వ్రాసి ఉండరాదా? ఇది జంగం కథల తత్త్వానికి భిన్నం. అనువాద, అనుకరణ వాఙ్మయాలు గ్రాంథిక వాఙ్మయంలో ఉన్నాయి. జంగంకథలన్నీ సమకాలపు వస్తువు (Plot) తోను, సంఘటనలతోను నిండిఉంటాయి. వీటిలోని సమకాలిక రాజకీయ, సాంఘిక పరిస్థితులను పరిశీలించి మనం ఇవి ఎప్పుడు జరిగినవో చెప్పవచ్చు.

కాంభోజరాజు కథాకాల మెప్పుడో ఇక్కడ చర్చించవలసుంది.

* నేను గృహలక్ష్మి పత్రికలో 1953-54-లో ప్రకటించిన 'జంగంకథ' అను వ్యాసావళిలో ఈ విషయమై విపులంగా చర్చించేను.

## కాంభోజ శబ్దం

కాంభోజ దేశాన్ని గురించి కొంతమంది తమ అభిప్రాయాలను వెలిబుచ్చేరు. వాటిని తెలియ జేస్తాను.

కాంభోజ (KAMBOJA) జాతివారు టిబెట్ పర్వతాలలోగాని లేక హిందుకుష్ పర్వతాలలోగాని ఉండేవారు. నేపాల్ దేశస్థులు కాంభోజ దేశమని టిబెట్ దేశాన్ని అంటారు. కాని ఆధునిక పరిశోధకులు కొందరు కాంభోజజాతివారు ఇరేనియన్ భాష మాట్లాడేవారు కాబట్టి హిందుకుష్ పర్వతాలలోనె ఉండవచ్చు అంటారు *

కాశ్మీర్ దేశంలోని నైఋతి భాగమూ, కఫీర్ స్థానంలోని కొంత భాగము కాంభోజదేశము. § క్రీస్తు పూర్వం ఏడవ శతాబ్దంలో ఉత్తర హిందూస్థానంలో పదహారు రాజ్యాలుండేవనీ, వాటిలో కాంభోజదేశ మొకటనీ, బౌద్ధమత గ్రంథాలనుంచి తెలుస్తూంది ×. కాంభోజదేశం హిందూదేశంలో వాయవ్య భాగంలోఉన్న ప్రదేశం. దీని రాజధాని ద్వారక +. అశోకుని శిలాశాసనాలనుంచి కాంభోజదేశము కాశ్మీర దేశములోని ఉత్తర భాగము అని తెలుస్తూంది †. కాంభోజుల ప్రశంస మహాభారతంలోను, విష్ణుపురాణంలోకూడఉంది ‡.

'ఉత్తరకాంభోజ ఉర్వీశులెల్ల'అని కాటమరాజు కథ యొక్క అనుబంధం (పుట 171)లో ఉంది.

బ్రౌనుదొర తెలుగు నిఘంటువులో కాంభోజ దేశాన్నిగురించి 'కాంబెదేశం (The country of Cambay )ఇది సింధుశాఖ సమీపప్రదేశం అనగా ఘూర్జర, సింధుదేశ భాగములు కావచ్చు. ఇది గుర్రాలకు ప్రసిద్ధి' అని ఉంది.

పై వివరణలనుంచి ఒక అంశం స్పష్టమవుతూంది. కాంభోజ దేశం ఉత్తర హిందూదేశంలోనె పడమటి భాగంలో ఉంది. కాని అందులో ఏప్రాంతం అను విషయాన్ని గురించి భేదాభిప్రాయాలున్నాయి. కాంబోజులు ఏ జాతి వారో? వారు ఇరాన్ భాష మాట్లాడేవారని స్మిత్తుగారి వ్రాతనుంచి తెలుస్తూంది.

□ కాంభోజులు పిశాచజాతులలో ఒకరు.

వీరి తర్వాతి దశ చూద్దాం.

## కాంభోజజాతి : కంబుజ

హిందూదేశపు పశ్చిమోత్తర ప్రాంతంలో ఉండిన జాతులలాగే కాంభోజులుకూడ హిందూదేశంలోకి జొరబడడం మొదలు పెట్టేరు. కాని అది ఏ కాలమందో స్పష్టంగా చెప్పలేము. వీరి వృత్తాంతం తర్వాత చాల కాలానికి తెలుస్తూంది. 'క్రీ. శ. పదవశతాబ్దం యొక్క రెంతో అర్ధభాగంలో బెంగాల్ దేశాన్ని కాంభోజులు అనే కొండ జాతివారు ఆక్రమించుకొన్నారు. వీరిని మొదటి మహీపాలుడు అనే రాజు (క్రీ. శ. 978-1030 తరిమి వేశాడు. ★

కాంభోజ శబ్దం నానాటికి 'కంబుజ'గా మారింది. 'తూర్పు ఇండియాదీవులు మలయాదేశముల

---

* The early history of India from 600 B.C. to the Muhammadan conquest by Vincient A. Smith. P 184.

§ An advanced History of India by R.C. Majumdar and others P. 56.

× History of India, Part I Ancient India by K. A. Nilakanta Sastry P. 40.

\+ The Buddhist India by Rhys. Davids P. 21.

† చిలుకూరి నారాయణరావుగారి అశోకుని ధర్మశాసనములు పుట 49

‡ చిలుకూరి వీరభద్రరావుగారి ఆంధ్రుల చరిత్ర మొదటి భాగముపుట 199

□ J. A. H. R. S. Vol. XVI పుట 56.

★ History of India, Part I Ancient India by K. A. Nilakanta Sastry P. 187.

సమూహంలో, కాంబోడియా దేశంలో కంబుజ రాజ్యమనేది రాజకీయంగాను, సాంస్కృతికంగానుకూడ చాల ప్రధానమైనది.† కాంభోజ జాతివారు ఇట్లు తూర్పు ప్రాంతంలో తమ నాగరికతను వ్యాపింపజేసేరు. ○

## కథాస్థలం ఏది?

కాంభోజులు కాంభోజదేశంలో ఉండగా ఈ కథజరిగిందా లేకవారు తెలుగు దేశంలో కొంత భాగాన్ని జయించేక జరిగిందా అనేదొక ప్రశ్న.

ఎన్నో వందలమైళ్ల దూరంలో ఉన్న కాంభోజ దేశంలో జరిగిన కథను పదంగా కట్టేనాకా మనకేమి అవసరం? కథలో తెలుగు దేశంలోని స్థలాలు చెప్పబడ్డాయి. కాబట్టి కాంభోజులు దక్షిణాపథానికి (దక్కన్) వచ్చి కొంతస్థలాన్ని ఆక్రమించుకొన్న తర్వాతే ఈ గేయం పుట్టింది. కాని గేయం ప్రారంభంలోనే,

“(ఉత్తరాది యా దేశమందున)”

అన్నాడు కవి అనగా, తెనుగుదేశంలోని ఉత్తర భాగమని తెలియజేసేడు. అంతేకాని ఈ ఉత్తర భాగానికి ఏపేరైనా ఉందేమో తెలియజేయలేదు.

## కథ ఎప్పుడు జరిగింది?

మనకు చరిత్రకు అందిన విశేషాలు ఈక్రిందివి. క్రీ. పూ. 300 ప్రాంతంలో మౌర్యచంద్రగుప్తుని వద్ద రాయబారియైన మెగస్తనీస్ ఆంధ్ర దేశ విశేషాలను కొంత తెలియజేసేడు. తర్వాత శాతవాహనులు సింహాసనాన్ని అధిష్ఠించేరు. వారి తర్వాత ఇక్ష్వాకులు, బృహత్పలాయనులు, కందరాజులు, విష్ణుకుండినులు మొదలైన చిల్లర వంశాలు కొంతకాలం పాలించేయి. పిమ్మట పల్లవులు, చోళులు విజృంభించేరు. తూర్పుచాళుక్యులు కొన్ని వందల ఏళ్లపాటు పరిపాలించేరు. ఆటుతర్వాత కాకతీయులు విజయనగర రాజులు, రెడ్లు మొదలైన వారు రాజ్యంచేసేరు. ఈమోస్తరుగా కాంభోజులు తెలుగుదేశంలో రాజ్యంచేసే అవకాశమే కలగలేదు కాబట్టి వారి పాలన ఆంధ్ర రాజులపరిపాలనకు పూర్వమే అయుండాలి.

కాంభోజులు ఆఫ్ఘనిస్థాన్‌కి పశ్చిమోత్తర ప్రదేశంలో కొలంత ఉండేవారు. అక్కడనుండిన. అనేక తెగలలాగే వారుకూడ హిందూ దేశంలో చొరబడ్డారు. అనేక జాతులవారు వివిధ కాలాలలో క్రీస్తుపూర్వంనుంచి ఆటుతర్వాత క్రీ. శ. పదవ శతాబ్దందాక అనేకసార్లు వచ్చినట్లు కనబడుతూంది. కాని కాంభోజులు ఆంధ్రదేశంలో బోగబడి కొంచెం అంధ భాగాన్ని పరిపాలించే అవకాశం ఎప్పుడు కలిగింది. క్రీస్తు పూర్వమేగాని ఇటీవల అవడానికి వీలులేదు అయితే క్రీస్తుపూర్వం ఎప్పుడు? దీనిని నిర్ణయించడానికి జంగం కథలోనె కొన్ని ఆధారాలున్నాయి.

*ఆంధ్రులు అని చెప్పబడుతూన్న పిశాచ జాతివారు = దేవతల),

† History of India, Part I Ancient India by K. A. Nilakanta Sastry P. 172

○ ఈ విషయమై మారేమండ రామారావుగారు 'భారతీయ నాగరికతా విస్తరణము' అను గ్రంథంలో రచించేరు.

* పిశాచులకు, ఆర్యులకు గర్భశత్రుత్వం. పిశాచులు అంటే ప్రకాశించువారు దేవతలు అని అర్థం. కాని ఆర్యులకు వారు శత్రువులుకాబట్టివారు తమభాషలోపిశాచి అంటే దయ్యంఅని అర్థం చెప్పుకొన్నారు. పిశాచుల భాషాలోని అర్థమే ఆంధ్రభాష లోకూడ ఉంది. పిసాళించు = ప్రకాశించు. ఇక్కడ ఆర్యసంప్రదాయం బలిసేక పిశాచమునకు (దయ్యము) అనే అర్థం బయలుదేరింది.

త్రిలింగ దేశంలోని తూర్పుతీర ప్రదేశంలో చేరేరు. పిశాచులలోనె మరొక తెగవారు కాంభోజులు. కాంభోజులుకూడ అంతకు పూర్వమో అప్పుడో మనదేశానికి వచ్చేరు. క్రీ. పూ. 6 వ శతాబ్దంలో ఆంధ్రులు కొంతప్రదేశంలో రాజ్యం స్థాపించేరు. అదే సమయంలో కాంభోజులుకూడ త్రిలింగ దేశంలోనె పశ్చిమోత్తరం ప్రాంతంలో చిన్నరాజ్యం స్థాపించుకొని ఉండాలి. కాని కాంభోజ పరిపాలన నశించింది. ఆంధ్రపరిపాలన వృద్ధి అయిందని చెప్పుకోవాలి.

అప్పటి మతంలో మాణిక్యదేవికి సంశయం కలిగింది. ఆకాలంలో మత విషయమై కొంత తగాదాలున్న మాట నిజం. దానినే ఆమె సందేహం సూచిస్తూంది.

ఆంధ్రులు కాంభోజులు ఇక్కడకి చేరిన కాలంలో త్రిలింగదేశంలో నాగులున్నారు. అందుచేత వారందరికి నాగుల సంఘర్షణ కలిగింది. కాంభోజరాజు కథ క్రీ. పూ. 6వ శతాబ్దం ప్రారంభంలోనె జరిగి ఉండవచ్చు.

కాంభోజరాజు తెనుగు ప్రాంతంలో పరిపాలన చేస్తూండగా ఒక నాగేంద్రుడు శరణుకోరేడు. ఈ నాగేంద్రుడు నాగుపాము కాదు, నాగులు అను ఒక జాతివారి నాయకుడు. కాంభోజరాజు నాగులను జయించి ఏడుమండలాలను ఆక్రమించుకొన్నాడని చెప్పవచ్చు. నాగేంద్రుడు నాయకుడని ఎరుగని తర్వాతి పాటగాళ్లు అతన్ని పాముగా వర్ణించేరు.

క్రీ. పూ. అయిదో శతాబ్ద ప్రాంతంలోనె దక్షిణహిందూ దేశంలో ఉచ్చదశలో నుండిన ఆంధ్రులు (పిశాచజాతివారు) అట్టడుగు రావడానికి శతాబ్దికంటె ఎక్కువ కాలం పట్టియుండాలి.

## నాగులు

నాగులు క్రీ. పూ. 1100 ప్రాంతంనుంచి హిందూదేశమంతటా వ్యాపించి ఉండేవారు. క్రీ. పూ 692 నుండి మగధ రాజ్యాన్ని శిశునాగవంశంవారు పరిపాలించేరు. వారిని నందవంశంవారు జయించేరు. నాగులు చెట్లను, పాములను పూజించడమే కాకుండ కాళియను భయంకర దేవతనుకూడ పూజించేవారు. రాళ్లు, నీటిబుగ్గలు మహత్వం కలవని తలచేవారు. నాగులున్న ప్రదేశానికి నాగలోక మనిపేరు. చరిత్రలో ఈ నాగులను గురించి పరిశోధన జరగలేదు. ♦

కాంభోజరాజుకథలో వచ్చిన నాగేంద్రుడికి తొమ్మిది శిరస్సులున్నాయి. జంగం కథలలో సాధారణంగా పన్నెండు శిరస్సులుంటాయి. నాగజాతివారి బొమ్మలు (రాళ్లలో చెక్కినవి కొన్ని అమరావతి శిల్పంలో ఉన్నాయి. వాటిలో మూడు, అయిదు, ఏడు పర్వాలుగలవి ఉన్నాయి. వాటి కింద మనిషి ఆకారముంటుంది. కొందరు మనుష్యుల క్రిందిభాగం తోకలాగుంటుంది. ★ ఈ శిరస్సులు నాగులు ధరించిన అలంకారాలుకావచ్చు. కొందరు నాగరాజులు తమ ధ్వజాలుమీద నాగబొమ్మలు * ధరించేవారు. తెనుగు దేశంలో నాగులు ప్రవేశించడానికి పూర్వం 'రాక్షసులు' అనే జాతివారు ఉండేవారు. ఆ రాక్షసులను నాగులు జయించేరు. కొంతకాలానికి కాంభోజులువచ్చి నాగులాక్రమించుకొన్న కొంత భాగాన్ని జయించేరు. అటు తర్వాత ఆంధ్రులువచ్చి కాంభోజులను, నాగులను వశపరుచుకొన్నారు. శాతవాహనులు, పల్లవులు మొదలైనవారు అధికారాన్ని పొందేరు. కాని ఇక్కడ ఆంధ్రుల నాగరికతం వ్యాపించినట్లుగా ఇతర జాతులవారి నాగరికత వ్యాపించలేదు. 'తెలుగు' మాటకు 'ఆంధ్రం' పర్యాయపదమైపోయింది.

(సశేషము)

♦ చిలుకూరి వీరభద్రరావుగారి ఆంధ్రుల చరిత్రము పుటలు 58, 69, 78, 54.

★ ,, ,, పుట 71

* The Early Dynasties of Andhra Desa by B. V. Krishna Rao P. 298

# మంచి మాటలు

శ్రీమతి ద్వివేదుల విశాలాక్షి

కొంతమంది స్త్రీలకు మంచి మాటలు చెప్పి ఇతరులచే పనిపాట్లు చేయించుకోడం బాగా చేతనవుతుంది. నిజంగా ఇది ఒక కళ అనవచ్చు. అంతమందికీ ఇది చేతకాదు. మామూలుగా ఇంట్లో పనివాళ్ళదగ్గర, పిల్లల దగ్గర దీని ఆవశ్యకత ఎంతేనా వుంటుంది. ఒక్కొక్క ఇల్లాలు ఎంతపెట్టినా కొంచముపని ఎక్కువ చేయవలసి వచ్చేసరికి నావల్ల కాదంటుంది పనిమనిషి. ఎక్కువ పెట్టకపోయినా మంచి మాటలతో వారిని పొంగేసి పనిచేయించుకొంటుందొక గృహిణి. "ఆ విడలా నేను డబ్బు ఇవ్వలేదా? నాకెందుకలా చేయవ"ని సాధించి చేయించుకొంటుందింకొక వనిత. కాని ఈ ముగ్గురిలోనూ మంచిగా పనిచేయించుకొనే ఆమెకే మనస్ఫూర్తిగా పనిచేస్తుంది పనిమనిషి. మిగతా వారికి వెట్టికి చేసినట్లే చేస్తుంది.

అందుకనే మన పెద్దలు "మంచిన విషమేనా తాగించవచ్చుకాని, చెడ్డన పాలేనా తాగించలే" మంటారు. ఈ విషయం చిన్న పిల్లల దగ్గర బాగా రుజువవుతుంది. పిల్లలు వుదయము లేచింది లగాయతు రాత్రి నిద్రపోయేదాకా అడుగడుక్కీ పేచీలు పెడ్తూంటారు. కొంతమంది తల్లులు వారికి మంచి మాటలు చెప్పి వారిచేత ఆయాపనులను సక్రమంగా చేయిస్తారు. మరికొందరు తల్లులు వారిని పట్టుకొని కొట్టి, తిట్టి వారు ఆ పనులను శ్రద్ధగా చేసేట్టు చూస్తారు. ఇంకొందరు తల్లులు వారు చేయునపుడు శ్రద్ధచూపక తరువాత అవి బాగులేవని వారిని శిక్షిస్తారు. ఈ మూడు రకముల తల్లుల దగ్గర పెరిగిన పిల్లలలో మొదటివారే, అనగా మంచి మాటలచే పనులు చేయించిన తల్లి దగ్గర పెరిగిన పిల్లలే పెద్దవారైనా వారి వారి పనులను సక్రమంగా చేసే అలవాటు కలవాళ్లవుతారు. చిన్నప్పటినుంచీ వారు ఒక క్రమపద్ధతికి అలవాటుపడివుంటారు. అలాకాక భయమువలన చేసినవారు ఆ భయముపోగానే, అనగా పెద్దవారవగానే ఆ క్రమమువిడిచి ఇష్టమువచ్చినట్లు తిరగడాని కలవాటుపడుతారు.

పిల్లలు క్రమపద్ధతిలో పెరుగుటకు తల్లులపై ఎంత బాధ్యతవుందో పాఠశాలలలో విద్యా బుద్ధులు నేర్పు గురువులయందు

కూడ అంతా వున్నది. ఇది మనము సాధారణముగా చూస్తునే వుంటాము. ఒక్కొక మేష్టరు దగ్గర పిల్లలు చాల భయభక్తులతో వుంటారు. ఆ పిల్లలే ఇంకొక మేష్టరు దగ్గర పెంకిగాను, అల్లరిగాను వుంటారు. ఈ అతిచనువుకాని, భయముకాని ఉపాధ్యాయులదగ్గర పిల్లలకి వుండడం అంత మంచిదికాదు. క్రిందటికి ఒక పిల్లడిని "అంత కష్టపడి ఆ నోట్సు ఎందుకు రాస్తున్నావబ్బాయి" అని అడిగితే "రాయకపోతే మా మేష్టారు తంతారు" అన్నాడు. అదీ వాడి దృష్టిలో నోట్సుకున్న విలువ. అంతేకాని తనకు చదువు రావాలని రాస్తున్నానన్న సంగతి ఆ కుర్రాడు గ్రహించుకోలేదు. అందుచే పిల్లలకు సరియైన విద్యాబుద్ధులు అలవడాలంటే మంచిమాటలచే పనులు చేయించే నేర్పు ప్రతి తల్లికి, ప్రతి వుపాధ్యాయునికీ వుండాలి.

మంచి మాటలంటే జ్ఞాపకము వచ్చింది. మూడేళ్ల క్రిందట కాబోలు నేను టీచరు ట్రయినింగు చదువుచున్న రోజులు. రాజమండ్రీలో బంధువులెవ్వరూ లేకపోవుటచే ఆడపిల్లల హాస్టలులోవుండి చదువుకొంటున్నాను. మా హాస్టలు వార్డెను మహా గడుసు మనిషి. అన్ని సబ్జెక్టులతోపాటు పాకశాస్త్రం కూడా ఒక సబ్జెక్టుగా వుండేది మాకు. ఈ సబ్జెక్టు చెప్పే ఆవిడే మాకు వార్డెనుగా వుండేవారు. ఆవిడ దగ్గర పాకశాస్త్రంకన్న, మంచిమాటలచే పనులు చేయించుకోవడమెలాగో నేర్చుకోవాలనిపించేది నాకు. మా అందరితోనూ చాలా సరదాగా మాట్లాడుతూ హాస్టలుకి కావలసిన చిన్న చిన్న పనులు తీరిక సమయములందు మాచే చేయిస్తుండేది. ఒక్కొక్కప్పుడు తనూ మా పనులలో పాల్గొనేది. మా సొమ్మంతా ఖర్చుచేస్తూ తిరిగి మాచేత పనులు చేయించడమా! అని మాలో కొందరికి ఆవిడపై కోపంగా వుండేది. కాని ఆవిడ ముందర జవాబు చెప్పలేకపోయేవాళ్ళం.

ఇలా చాలా రోజులు గడచిపోయాయి. ఇక నెల రోజులలో మా ట్రయినింగు పూర్తయి వెళ్లిపోతామనగా ఒక సంఘటన జరిగింది. ఎవరో అధికారులు స్కూలు తణిఖీకి వచ్చేరు. వారికి మా హాస్టలులో విందుచేతామని నిశ్చయించేము. కాని అవి పెళ్లిళ్ల రోజులవడముచే వంటలవాళ్లు దొరకలేదు. హాస్టలులోవున్న వంటవానికి స్వీట్సు చేయడం బాగారాదు. సరే ఏదేనా క్లబ్బునుండి తెప్పించుదామనుకున్నాము. కాని మా వార్డెను అందుకు వప్పుకోలేదు. "స్కూలులో పాకశాస్త్రంకూడా ఒక సబ్జెక్టుగావుంది కాబట్టి మనమే తయారు

చేసి వారికి పెటినట్లైతే చాలా బాగుంటుంది. అట్టే డబ్బుకూడా ఖర్చుకాదు'' అన్నారు. దానితో మాకు ఎక్కడలేని కోపము వచ్చింది. ఇంక ఎలాగూ వెళ్లిపోతూన్నాముకదా అని నిర్భయంగా వ్యతిరేకించేము ఆవిడతో. ఈ నాటి విందుకు ఎంత సొమ్మయినా ఖర్చుచేస్తాముకాని, పల్లెత్తు పనైనా ముట్టుకోమన్నాము. వాదవివాదాలు ఎక్కువకాగా, కోపంతో ఆవిడ వెళ్లిపోయింది.

ఆవిడ కోపముతో వెళ్ళిపోవడముచేత మాలో మాకు అభిప్రాయ బేధాలొచ్చాయి. ఇన్నాళ్లు మంచిగావుండి చివరకు ఆవిడకు కోపము తెప్పించడము మంచిదికాదని కొందరు వాదించేరు. మనమీద కోపముచే ఏదేనా చెడ్డరిమార్కు రాసేస్తుందేమో అని భయపడ్డాము. మాలో మేము వాదించుకోడం పూర్తయింది. ఆ రోజు విందుకి కావలసిన ఏర్పాట్లన్నీ చేయడానికి సిద్ధంగా వున్నామని ఆవిడకు కబురు పెడదామని నిశ్చయించేము. ఇంతలో మా స్కూలు బంట్రోతు ఒక నోటీసు పట్టుకొని వచ్చేడు. అందులో ఈ రోజు విందు రద్దుచేయబడ్డాదనీ. మామూలుగా పాకశాస్త్రం ప్రాక్టికల్ క్లాసుకు అందరూ రావలెననీ, అదీకాక ఇన్‌స్పెక్ట్రెస్ వస్తున్నారని రాసివుంది. ఎంతో వుత్సాహంగా విందుకు తయారవబోతూన్న మాకు ఈ వార్త నిజంగా నిరాశకలిగించిందని చెప్పక తప్పదు.

సరిగ్గా టైముకి ప్రాక్టికల్ హాలులోకి వెళ్ళేము అందరమూ. పూర్వపు కోపమంతాపోయి మాతో మామూలుగానే మాట్లాడింది ఆవిడ. ఇంతలో బంట్రోతు ఇంకొక నూతన స్త్రీని రూములో ప్రవేశ పెట్టేడు. ఆవిడే మా కొత్త ఇన్‌స్పెక్ట్రెస్ అయివుంటుందని మేము వూహించేము. మా వూహ సరియైనదే. ఆమె వచ్చిన వెంటనే మేము చెయ్యవలసిన క్రమమంతా చెప్పి ఆమెను ఇంకొక క్లాసులోనికి తీసుకొని వెళ్లేరు మా టీచరు. అందరము పట్టుదలతో శ్రద్ధగా చేస్తున్నాము. వారు తిరిగి వచ్చేలోగా మేము తయారుచేస్తున్న పదార్థాలు పూర్తికావాలి. ఒక్క అరగంట గడిచింది. రమారమి అన్నీ పూర్తి అయినట్లే. ఇంతలో మా వార్డెను నవ్వుకుంటూవచ్చి; ''ఇంకెందుకట్టా! ఆ తొందర. ఆవిడ వెళ్లిపోయినారు. అర్జంటుగా ఇంకొక స్కూలుకి వెళ్ళాలిట'' అన్నారు. ''అయ్యో! ఇంతాకష్టపడి చేసేము. అదీకాక ఈ విడగారికోసం విందుకూడా రద్దు చేసుకొన్నాము'' అన్నాం. ''అవును, నిజమే. అన్నీ చెయ్యకనే చేసేరు. ఇవన్నీ వూరకనే పారపోసేకంటె ఆ అధికారులను పిలచి పెట్టిస్తే సరిపోతుంది.

మాటా, మర్యాదాకూడా దక్కుతుంది. మరి మీ రేమంటారు?'' అన్నారు.

''సరే'' అన్నాము.

విందు యథావిధిగా పూర్తయింది. అధికారులందరూ మా వంటలను చాల మెచ్చుకొన్నారు. తరువాత తెలిసిన భోగట్టా ఏమిటంటే - మా టీచరు ఆ విందుకొరకే ప్రాక్టికల్ పేరుతో మా చేత



జీవనోపాధికొరకు ...

అవన్నీ చేయించేరట. ఆ నూతన స్త్రీ ఆమె స్నేహితురాలట. హోష్టలు చూడడానికివస్తే ఈ నాటకం ఆడారు. ఆవిడ ఇప్పటికీ అంటుంటారు. ''ఈనాటి పిల్లలు తిన్నగా చెప్తే వింటారా! వారికెన్ని డొంక తిరుగుళ్లు పెట్టాలి!'' అని.

# అరుణాచలం

శ్రీమతి సూరినాగమ్మ

నాల్గయిదు రోజుల క్రితం కొందరు భక్తులు గిరి ప్రదక్షిణం వెడుతూ రమ్మనిపిలిస్తే భగవాన్ సెలవు పొంది వెళ్ళాను. అడి అణ్ణామలకు చేరేసరికి వర్షం రావడంవల్ల రోడ్డుకు సమీపంగావున్న ఒక చిన్న మఠంలో అంతా కూర్చున్నాం. అక్కడఉన్న సాధువుతో "ఈమఠం ఎవరిది?" అన్నాను. "మాణిక్య వాచకులది" అన్నాడాతడు. "ఇక్కడ ఇది ఏ కారణంవల్ల ఏర్పడ్డది?" అని నేనంటే ఏవో కథలు చెప్పాడు. నాకు అర్థంకాలేదు. భగవాన్‌తో మనవిచేసి తెలుసుకోవచ్చునని ఊకొట్టి వూరుకున్నాను.

శ్రీవారి నడిగేందుకు సమయం చూస్తుంటే నిన్న బ్రహ్మకైవర్తపురాణాంతర్గతమైన కాళీశ్వర మాహాత్మ్యంలో సుందరమూర్తికథ, చదువుకుంటు కూర్చున్నారు భగవాన్. సుందరులు కాళీశ్వరాలయ ప్రవేశార్థంవెళ్ళి ఎదురుగానున్న గజపుష్కరణిలో స్నానానికి మునిగిలేచేసరికి కోవెల అదృశ్యంకావడం "ముందే నిన్ను సేవించడానికి రానందుకు ఇది ఫలమా?" అనే అర్థంగల పద్యాలు పాడగానే కోవెల గోచరించడం ఇత్యాది కథాభాగం పైకిచదివి "వారికి ముందు అంతా జలమయంగాతోచి, వెనక జ్యోతిరూపంగా కనుపించిందట" అని చెప్పారు భగవాన్.

"అరుణాచలంగూడా జ్యోతిరూపమే అని అంటారుగదా?" అన్నారొక భక్తులు. "అవును. మాంస నేత్రాలకే శిలాకారంగాని అసలు జ్యోతిరూపమే" అన్నారు భగవాన్. అదే సమయమని అడి అణ్ణామలలో మాణిక్యవాచకుల మఠమని ఒకటి ఉన్నదే; అక్కడ అది ఏర్పడడానికి కారణం ఏమో?" అన్నా నేను. "అదా! వారు క్షేత్రాటనచేస్తూ ఇక్కడికిన్నీ వచ్చారట. అప్పుడు ఆ స్థలంలో నిలబడి అరుణగిరినిచూస్తూ (1) 'తిరువెణ్బావై' పాటలూ, (2) 'అమ్మానే' అనే పాటలూ పాడారనీ, అందువల్ల ఆ మఠం ఏర్పడిందనీ అంటారు. తిరువెణ్బావై పాటలు కొన్ని విన్నారుగదా. అవి ఇరువది పాటలు. ఆండాళు కృష్ణుని గురించి ముప్పది పాడింది. ఆ విధంగానే నన్ను గురించి మురగనారున్నూ చాలా పాడారు" అన్నారు భగవాన్.

"ఈ గిరికి అణ్ణామల అన్నపేరు ఎందుకు వచ్చింది?" అన్నారొకరు. "బ్రహ్మ విష్ణువులకు అందని మల (కొండ) అణ్ణామల. అదే ఆ పేరుకు కారణం" అన్నారు భగవాన్. "ఈ గిరికి ఒక ఆకారం ఉన్నదిగదా?" అన్నారా భక్తులు. "బ్రహ్మ విష్ణువులకు గోచరించినప్పుడు ఒకే జ్యోతి స్తంభంగా అంతటా ఆవరించినట్లున్నది. కొండగా గోచరించటం వెనకగదా! ఇది ఈశ్వరుని స్థూల రూపం. జ్యోతిస్సే సూక్ష్మరూపం. వీటన్నిటికీ పరమైనదే యదార్థ స్వరూపం. అ = రుణం = బంధములు లేనిది. అ = చలం = చలనరహితమైనది, అరుణాచలం. సూక్ష్మమంటే అంతటా నిండివున్న తేజస్సే" అన్నారు భగవాన్. "సుందరమూర్తికీ అంతేనా?" అన్నారా భక్తులు. "అవును. ముందు జలమయమై, వెనుక జ్యోతిగాతోచి, ఆ వెనుక మాంసనేత్రాలకు కోవెలగా గోచరించిది. మహాత్ములెప్పుడూ ఆంతర నేత్రంతోనే చూస్తారు. అందువల్ల వారికి సర్వం జ్యోతిర్మయంగానూ బ్రహ్మమయంగానూ తోస్తుంది" అన్నారు భగవాన్.

"ఈ అరుణాచల లింగోద్భవాన్ని గురించి భగవాన్ ఒక పద్యం వ్రాశారు గాబోలునే?" అన్నాను నేను.

---

(1) తిరువెణ్బావై = ధనుర్మాస ప్రభాతగీతం. (2) అమ్మానే = బంతిఆడే పాటలు.

"అవును. విక్రమ సంవత్సర శివరాత్రికి ఎవరో అడిగితే వ్రాశాను. తెలుగులో గూడా వ్రాశానేమో" అన్నారు భగవాన్. "అవును. ధనుర్మాసంలో ఆరుద్రానక్షత్రంనాడు లింగోద్భవమైందనీ, ఆలింగంలోనుండి బయల్వెడలిన శివమూర్తిని విష్ణువూ, దేవతలూ సేవించినదినమే శివరాత్రియనీ, అది కుంభ మాసమనీ ఆ పద్యంలో చెప్పారు. అందుకు మూల కథయేమిటి? కృత్తిక దీపోత్సవ సందర్భంఏమిటి?" అన్నాను.

"అదా. బ్రహ్మ విష్ణువులిద్దరూ 'నేను పెద్ద, నేను పెద్ద' అని వాదించుకుంటూవుంటే, వారి మధ్యన కార్తీక మాసంలో కృత్తికా నక్షత్రంనాడు జ్యోతి స్తంభం ఆవిర్భవించిందట. అందువల్ల ఆ చిహ్నంగా, ఆ నెలలో ఆ నక్షత్రంనాడు దీపోత్సవం జరుగుతున్నది. బ్రహ్మ విష్ణువూ ఆ స్తంభానికి ఆదీ, అంతం తెలుసుకోవాలనివెళ్ళి, వెతికి వెతికి విసుగు చెందాక, గర్వవర్జితులై ఇద్దరూ ఒక్కచోటున చేరుకొని పర దైవాన్ని ప్రార్థిస్తే, ఆ జ్యోతి స్తంభాంతర్గతుడైన సదాశివుడు వారి దృష్టికి గోచరించి అనుగ్రహించాడనీ, వారు 'మాకు సేవ్యమానుడవై వుండా'లని ప్రార్థిస్తే, పర్వతాకారంగానూ, లింగాకారంగానూ ఉంటాననిచెప్పి, లింగార్చన విధానం బోధించి, మీరంతా లింగాకారంతో ఉండే నన్ను అర్చిస్తే కోన్నాళ్ళకు ఆలింగంలోనుండి నాఅంశంవల్ల శివ మూర్తి రుద్రాభిధేయంతో వెలువడి మీకు సహాయ కారిగా ఉండగలడనీచెప్పి అంతర్హితుడైనాడట. ఆ వెనుక ధనుర్మాసంలో ఆరుద్రా నక్షత్రంనాడు జ్యోతిర్లింగమైన అరుణగిరినుండి స్వయంభూలింగం ఆవిర్భవించిందనీ, నాటినుండీ ఈశ్వరాదేశానుసారం వారంతా లింగార్చన విధానాన్ని అనుష్ఠిస్తూరాగా కుంభ మాసంలో కృష్ణపక్షత్రయోదశినాడు అర్ధరాత్రివేళ ఆలింగంలోనుండి శివమూర్తి ఆవిర్భవించి హరికులచేత సేవింపబడడంవల్ల ఆ దినమే 'శివరాత్రి' అనీ శివపురాణంలోనూ లింగపురాణంలోనూ చెప్పివున్నది. నాటినుండే లింగార్చన విధానం ఆరంభమైందట. ఈ అరుణాచల లింగోద్భవమే ప్రథమ లింగోద్భవమని లింగపురాణంలో దృఢంగా చెప్పివున్నది. నా పద్యానికి మూలశ్లోకం లింగపురాణాంతర్గతమే" 'అని సెలవిచ్చారు భగవాన్.

భగవాన్ వ్రాసిన పద్యం ఇదిః-(లింగోద్భవం)

తొలి యరుణాచల లింగము।
కలిగెను ధనువునెల నార్ద్రఘనలింగమునన్
వెలివడు శివుని హరి సురలు।
గొలిచినదినమె శివరాత్రి కుంభపునెలయా॥

(4-2-41)

# సుభాషితాలు

శ్రీమతి గం. లక్ష్మీదేవి

"మూర్ఖుల మౌనం వారిలోగల రవంత వివేకానికి చిహ్నం. వివేకవంతుల మౌనం కేవలం సుగుణం."

"బొనార్డ్"

"ఊరకే రచనలుచేసి పారవేయాలనే ఉబలాటం అనేకమందిని పీడిస్తున్న అనివార్యమైన అంటువ్యాధి."

"జువెనాల్"

"హృదయమును సత్యం సంశోధిణమొనర్చుకొన్న వ్యక్తికి, జిహ్వకి శిక్షత ఇచ్చుకొనవలసిన అవస్థ ఉండదు."

"రస్కిన్"

"తన భావమును బహిరంగంగా ప్రకటించుకొను హక్కు స్వతంత్రుడైన ప్రతి వ్యక్తికీ ఉన్నాది. శాంతిసమయంలోగాని, యుద్ధసమయములోగాని, సభారంగాల్లోగాని సర్వదా సర్వత్ర ఈ హక్కును అతడు వినియోగించుకొనవచ్చును!"

"పోప్"

"ఆహారప్రేమతో తుల్యమైన హృదయపూర్వకమైన ప్రేమ ఈసృష్టిలోలేదు."

"జార్జ్ బెర్నార్డ్‌షా"

"అప్పులవారితో స్నేహముచెయ్యిగాని, స్నేహితుల దగ్గరమాత్రం అప్పు చెయ్యకు."

"హెన్రీ" - "ఫోర్డూన్"

"అజ్ఞానము భగవంతుని శాపకల్పితము. విజ్ఞానము స్వర్గవిహారం చెయ్యడానికి ఉపకరించే పుష్పక విమానం"

"షేక్‌స్పియర్"

"'సత్యం' చీర సింగారించేలోగానే 'అసత్యం' భూప్రదక్షిణం చేసి వస్తుంది."

"జాన్‌ప్లోమాన్"

"మరో ధ్యాసగాని, మరో వృత్తిగాని ఏమాత్రం పెట్టుకొనక విశేషధనార్జన చేయగలగడంలోనిది చిదంబర రహస్యం"

"జార్జ్ బెర్నార్డ్‌షా"

డిటెక్టివు కథ

# విచిత్రహత్య

శ్రీ కొత్తూరి నరసింహారావు

డెయిసీకీటన్ హత్యకు స్వంత కుమార్తె ఓడియా కారణము కావడం చాలమందికి ఆశ్చర్యకారణ మయింది. ఓడియా సన్నగా, పొడుగుగా నాజూకుగానుండేది. డెయిసీకీటన్‌కు 50 ఏండ్లవయస్సున్నా కాయవాటు శరీరంకలది కాబట్టి నడివయస్కురాలిలాగుండేది. ఆమె చూపులలోను, వైఖరిలోను నిరంకుశత్వము, స్వేచ్ఛాతృష్ణ ఉట్టిపడుతుండేవి. ఆమె భర్త అప్పటికి చనిపోయి 15 సంవత్సరాలయినా లారెత్ నగరంలో స్వంతయింట్లో ఓడియాతో నివసిస్తుండేది. వాళ్ళకు తోడుగా పెంపుడు కుక్క యుంటుండేది.

డెయిసీకీటన్ చండశాసనాలు ఓడియా స్వేచ్ఛను అరికట్టినాయి. ఎక్కడికీ ఒంటరిగా పోనిచ్చేదికాదు; ఎవరితోను సరదాగా మాట్లాడటంకాని, కాలం గడుపడంగాని చూచి సహించేదికాదు. దైవప్రార్థనకని ఆలయానికి పోయినప్పుడు సయితం నలుగురితో సర్దాగా నుండటానికి నోచుకున్నదికాదు ఓడియా.

గడచిన 15 సంవత్సరాల కాలంలో ఓడియాను ఒంటరిగా వదలి ఏయూరికి వెళ్ళి ఎరుగదు డెయిసీకీటన్ కాని ఒకరోజున తన పెద్దకుమార్తెను చూడటానికి వెళ్ళనున్నట్లు చెప్పింది, ప్రయాణసన్నాహాలు పూర్తయినవి.

♦ ♦ ♦

చల్లని యీదురుగాలి కొడుతున్నది. నగరపరిసర ప్రాంతాన నున్న చిట్టడవులలో ఈవాన్స్ వేటకు బయలుదేరాడు. కొద్దికాలంలోనే రెండుమూడు కుందేళ్ళను పట్టుకున్నాడు. చలి విపరీతంగానున్నా ఓర్చుకొని ముందుకు సాగిపోతున్నాడు. మరొక కుందేలు తప్పించుకొనిపోగా దానిని వెతుకుతుండగా సమీపమున రోడ్డుప్రక్కనున్న తుప్పలో ఏదో తెల్లగా కనుపించింది. అదేదో జంతువని భ్రమించి తుపాకి పేల్చాడు కాని చైతన్యరహితంగా నుండుటచే దగ్గరకుపోయి పరీక్షగా చూచాడు. అది జంతువుకాదు - ఏవో భద్రంగా ప్యాక్ చేయబడిన పెట్టెలు. అవి ఎవరివో - ఏమిటోననే సందేహంతో కొంచముసేపు ఆలోచించి ఎవరూ వానిని వెదకికుంటూరాకపోవడంచేత ఒక పెట్టెను పగులగొట్టి లోపలనేమున్నదో చూడ కుతూహలుడైనాడు. పెట్టెమూత బ్రద్దలుచేయబడి లోననున్న వానినిచూచి భయభ్రాంతుడయ్యాడు.

ఆ పెట్టెలోనున్నది - రక్తసిక్తమయిన మానవుని బొటనవ్రేలు.

భయసంభ్రమాలతో ఇవాన్స్ అరచిన అరపులకుదారిన పోతున్న యిద్దరు పెద్దమనుష్యులు వచ్చిచూచి, రెండవ పెట్టెకూడ బ్రద్దలు చేయబడింది. అందులో మొదటి పెట్టెలోని బొటనవ్రేలుకు సంబంధించిన కాలున్నది.

ఈ విషయం పోలీసు విచారణలో పడ్డది. జరిగిన దర్యాప్తు ఫలితంగా ఆకాలు, వ్రేలు ఒక స్త్రీవై యుండాలనియు, ఆమె చక్కని ఆరోగ్యంతో షుమారు 45, 50 సంవత్సరముల వయస్సుకలిగియుండియుంటుందని తేలింది. పెట్టెలనుచూచి, పగులగొట్టిన ఇవాన్స్‌ను, యిద్దరు పెద్దమనుషులను పోలీసులు తమ స్వాధీనంలోకితీసికొని యింకా దర్యాప్తు చేస్తున్నారు. హంతకుని కనిపెట్టుటకని విశ్వప్రయత్నాలు జరుగుతున్నవి. ఒక మోటారు మెకానిక్ మూలంగా ఓడియాకు యీ హత్యతో సంబంధమున్నట్లు సూచనలు కనుపించినవి.

మూడు నెలలు దర్యాప్తు జరిగింది. ఒకరోజున పోలీసు అధికారి ఓడియా కొరకు కబురుపంపి పిలిపించాడు.

ఓడియా ముఖం కళావిహీనంగా నున్నది. ఏదో మానసికంగా కలవరపడుతున్నట్లు ఆమె వైఖరి రుజువు చేస్తున్నది.

అధికారితో ఆమె "ఆ కాలి ఖండములనుగురించి విన్నప్పటినుండి ఎందుకో భయంగా నున్నది; మా అమ్మకు కూడ యున్నది అటువంటి పెద్ద బొటన వ్రేలే!" అన్నది.

"ఇప్పుడు మీతల్లి న్యూఆర్లియన్స్‌లో నున్నది కదా?"

"ఆమె బయలుదేరి వెళ్ళినమాట నిజమే. కాని యీ బొటనవ్రేలు మాత్రము ...... వెళ్ళేముందు ఆమెతో మాట్లాడవచ్చిన ఒక స్త్రీవ్యక్తిపట్ల ఆమె ప్రవర్తన విచిత్రముగా నుండింది..."

"ఆ స్త్రీ ఎవరైయుంటుంది? ఆమెను నీవు అంతకు ముందుగాని, తర్వాతగాని చూచావా?"

"ఆమెపేరు నాకు తెలియదు. ఆమె వెళ్ళిన తర్వాత మా అమ్మ నాతో ఎప్పటియట్లు సాధారణంగా నుండాలని ప్రయత్నించినా, అప్పుడప్పుడూ కసురుతూ మాట్లాడసాగేది. మరునాడుదయమే మా తల్లియూరికి బయలుదేరి వెళ్లింది."

'మీ అమ్మ యూరికిపోయి నీకు జాబువ్రాసిందా?'

"వచ్చింది. కాని మొన్నరాత్రినుండి ఆజాబుతో బాటు మా అమ్మ డ్రాయర్‌లోని కాగితాలు, పుస్తకాలు కనుపించడంలేదు. డ్రాయరుతాళం బద్దలు చేయబడియుంది — ఎవరో వానిని దొంగిలించారు"

"మీ అక్కకు జాబువ్రాసి మీ తల్లి యోగక్షేమాలను యీ మధ్య తెలిసికున్నావా?"

"వారంరోజులక్రిందట ఆమె దగ్గరనుండి జాబు వచ్చింది మా తల్లి అక్కడనుండి బయలుదేరి వచ్చిందని."

పోలీసు అధికారి ఆలోచించి "నీవు బొటన వ్రేలును చూచి గుర్తుపట్టగలవేమో..." అన్నారు.

ఓడియా "గుర్తుపట్టగలను. కాని వానిని చూడలేను...భయం...భయం" అన్నది తొట్రుపాటుతో.

"ఔను భయమే! కాని చూడకతప్పదు" అని ఓడియాను బొటనవ్రేలు భద్రము చేయబడి యున్న చోటుకు తీసికొనిపోయి చూపించారు. ప్రకాశవంతమైన విద్యుత్ దీపాలకాంతిలో దానినిచూచి "అది...అది...నా తల్లి దానివలెనే యున్నది... నాకు..." అంటూ మూర్ఛిల్లింది. క్రిందపడిపోతున్న ఓడియాను ప్రక్కనున్న నర్సులు ప్రక్కగదిలో పండుకొనబెట్టి పరిచర్యలు చేయసాగారు.

అప్పుడు పోలీసు అధికారి డెయిసీకీటన్ హత్య చేయబడిందని రూఢిచేశాడు. డెయిసీకీటన్ కుటుంబమునకు అత్యంత సన్నిహితుడగు కార్టర్‌ను పిలిపించి విచారించారు. కార్టర్ "కీటన్ చాలవిపరీతమయిన మనిషి. ఆమెను యిప్పటికిని నేను అర్థంచేసికోలేకున్నాను. ఆమె ఓడియాను మహాకష్టపెట్టేది. పాపం ఒడియా చాల ఓర్పుకలిగి యుండింది. ఉన్నట్టుండి ఆమె న్యూఆర్లియన్స్‌కు వెళ్ళినదని విని ఆశ్చర్యపడ్డాను" అన్నాడు.

"ఆమె బయలుదేరి వెళ్ళేముందు ఎవరో ఒక స్త్రీ వచ్చి మాట్లాడి పోయిందట - ఆమెను నీకు తెలుసా"

"తెలియదు"

కొంచము సేపయినతర్వాత "ఈ కాలి బొటనవ్రేలు డెయిసీకీటన్ దనడం అసందర్భము. ఆమె రెండుమూడు రోజులలో తిరిగి వస్తుంది."

♦ ♦ ♦

ఓడియా తన పెంపుడు కుక్కతో ఒంటరిగానే ఆ యింట్లో నుంటున్నది. ఆమె స్నేహితులు, బంధువులు తమతో నుండమని ఎంత బలవంతంచేసినా విన లేదు. పెంపుడుకుక్క మాత్రం ఎందుకో కవరబారుతూ తరచుగా అరుస్తుండేది ఆమె పొలమువ కనుపించి నప్పుడల్లా.

ఒకరోజు రాత్రి 10 గం. ల సమయం. ఓడియా యింట్లో కుక్క విపరీతంగా అరవడం మొదలు పెట్టింది. ఓడియా ఒక గదిలోకి పోయి తలుపు వేసు కొన్నది. ఏమిటా యీ కలకలము అని చుట్టుప్రక్కల నున్నవాళ్ళంతా వచ్చిమూగారు. కుక్కను ఎంత శాంతపరచాలని ప్రయత్నించినా లాభం లేకపోగా బలవంతగా అవతలికి తీసికొని పోయారు. ఓడియా నీరసంగా గదిలో మూల్గుతుండటం వినిపించింది. ఎంతో శ్రమతో ఆ గదితలుపు తీసి లోపల చూడగా ఓడియా పడిపోయియుంది. ఆమె తలమీద బలమైన గాయమున్నది. అందులోనుండి కారిన రక్తము గోడ మీద, ఆమె గుడ్డలమీద మరకలైయున్నది.

చుట్టూ మూగినవారితో నీరసంగా ఓడియా "ఎవరో స్త్రీ...నన్ను హత్యచేయవచ్చి పారిపోయింది" అన్నది.

ఓడియా వైద్యశాలలో స్వస్థత చెందుతున్నది. పోలీసు అధికారి డెయిసీకీటన్ హత్యకు, ఆనాటి సంఘటనకు ఏదో సంబంధమున్నదని తీవ్రంగా ఆలోచించి ఆమె దగ్గరకువెళ్ళి "ఓడియా! మీ తల్లిహత్య సందర్భమున నీవు నిజం చెప్పడంలేదు ... యింకా దాచుతున్నావు" అన్నారు.

"నేను చెప్పాల్సిన దంతా చెప్పాను. ఇంకేమి చెప్పమంటారు"

"మొన్నరాత్రి నిజంగా నిన్ను హత్యచెయ్యడానికి ప్రయత్నము జరిగిందా! - యిందులో రహస్యముంది నీవు ఏదో దాపరికంగా అబద్ధాలాడుతున్నావు"

ఓడియా వెలవెలబోతూ "నేను అబద్ధాలాడుతున్నానా..." అన్నది.

"మమ్మాత్రికీని - నీవింతవరకు చెప్పిన దానికంటె నీకు యింకా తెలుసును. నిజంచెప్పు - నీతల్లిని ఎవరు చంపదలచింది, ఎందులకనీ నీవు చెప్పితీరాలి."

"నా కదేంతెలుసు ?"

"నిజంగా నీకు తెలియదా! - మొన్న జరిగినదంతా కట్టుకథ. నిన్ను హత్యచెయ్యడానికి ఎవరు వచ్చి యుండరు. ప్రతిక్షణం నీమీద, నీతోయున్నవాని మీద కవరబారుతున్న కుక్కను మీరు చంప ప్రయత్నించి యుండాలి. అందుకనే కుక్క అలా అరచి గగ్గోలు పెట్టింది. దాని కట్టికోపానికిగల కారణానికి, మీతల్లిహత్యకు తప్పకుండా సంబంధముండియుండాలి. కుక్కయొక్క గగ్గోలుకు నలుగురూవచ్చి మూగడం మొదలుపెట్టేసరికి ఎవరో ఒక వ్యక్తి – స్త్రీమాత్రం కాదు - కిటికీగుండా దూకి వెళ్ళాడట. నీవుగదిలోకి పోయి లోన గడియవేసుకొని తలను గోడకు మోదుకొని పడిపోయావు. దానికాధారములు గోడమీద, నీ గుడ్డలమీదనున్న రక్తపు మరకలు."

"మీరు పొరబాటుగా...భావిస్తున్నారు"

"లేదు ఓడియా! మీ కుక్కకు నీ మీద విపరీత మయిన కోపావేశములకు కారణమేమయియుంటుంది? నీపై పగబట్టింది అది. కనీసం నీ దుస్తులను చూచినా అది కోపోద్రిక్తమగుతున్నది."

ఓడియా మౌనం వహించింది.

పోలీస్ అధికారి ఒక చిన్నమూటను జేబునుండి తీసి అందులోవి బూడిదను, గుండీని, ఇనుపముక్కలను ఓడియాకు చూపిస్తూ "నీతల్లిహత్య మీ యింట్లోనే జరిగి యుండాలి. చలిమంటలు వేయు నెగడిలో దొరకిన యీ బూడిదలో యీ గుండీ,యినుపముక్కలు దొరికాయి. ఈ హత్యజరిగిన కొద్దికాలంపాటు మీ యింటినుండి శవదహనపు వాసన వస్తుండేదని చుట్టుప్రక్కల నున్నవాళ్లు చెప్తున్నారు. బూడిదలోని యినుప ముక్కలుమీ అమ్మ బెల్టులోనివి; గుండీ మీ

అమ్మది. మీ అమ్మ చంపబడి చలిమంటలు వేయు సెగడిలో వేసి కాల్చబడియుండాలి”

రెండు చేతులతో కండ్లు మూసుకొని ఏడుస్తూ “ఇదంతా నాకేది తెలియదు” అన్నది ఓడియా.

“ఇంకా కథలల్లుదామనేనా నీ ప్రయత్నము! మీ తల్లి మృతకళేబరము ముక్కముక్కలుగా చేసి కాల్చబడి యుండాలి. ఆ వాసన ఫలితంగా యింటి చుట్టూయున్నవాళ్లు ఆరాలుతీయడం మొదలుపెట్టే సరికి హడావుడిగా మిగిలిపోయినకాలును, బొటన వ్రేలును పెట్టెలలో భద్రంచేసికొని మోటారుకారులో తీసికొని వెళ్తుండగా కారు నడిదారిలో ఆగిపోయిదంట. అందులో నీవు, యింకొక ఎవరో ఒక వ్యక్తియున్నట్లు మోటారు మెకానిక్ చెప్తున్నారు. మీరే ఆపెట్టెలను పారేసి యిల్లుచేరి యుంటారు. ఈ హత్యను నీవే చేయించియుండాలి నీతోసహకరించిన వ్యక్తిఎవరు” అన్నారు.

“మీరు ఊహించింది చాలవరకు యదార్థమే. మా తల్లి నిరంకుశత్వాన్ని సహించలేక పోయాను. ఎలాగైనా నాతల్లిని చంపిస్తేకాని నాకు స్వేచ్ఛలభించేటట్లు కనుపించలేదు. దానికితోడు ఆమె ఎప్పుడూ యిల్లు విడిచిపోనిది న్యూఆర్లియన్స్‌కు ప్రయాణ మగుట. ఆ రాత్రే కార్టర్ సహాయంతో ఆమె హత్యగావించబడింది.”

“అంటే... కుమార్తెవై నీవేహత్యను ప్రోత్సహించావన్నమాట. అందులో కార్టర్ యొక్క ప్రమేయానికి కారణమేమిటి?”

“కార్టర్, నేను ఒకరినొకరం గాఢంగా ప్రేమించుకొని వివాహమాడదలచాము. కాని దానికి మాఅమ్మ విముఖురాలైంది. మా వివాహం స్వేచ్ఛగా జరుగడానికని మా అమ్మను ...”

ఓడియా, కార్టర్‌లు అరెస్టు చేయబడి న్యాయస్థానంలో హాజరుపెట్టబడ్డారు. కార్టర్ యీ హత్యను గురించి ఓడియా చెప్పిన వివరాలు యదార్థములు కావని మొరబెట్టుకున్నాడు. ఓడియా చాల నీరసంగా మాట్లాడడానికి కూడ శక్తిలేకుండినది. న్యాయమూర్తి వారిరువురికి జన్మాంతర కారాగారవాసశిక్ష విధించాడు. కార్టర్ యింకా సజీవుడై శిక్ష అనుభవిస్తున్నాడేమో కాని ఓడియా మాత్రం ఏనాడో చనిపోయి యుంటుందని ఆమె బంధువులు, స్నేహితులు అనుకొంటుంటారు.

---

ఒక ఉపాధ్యాయుడు పాఠంచెప్తూ “నేను తల క్రిందబెట్టి కాళ్లు పైకి నిలిపితే రక్తము క్రిందివైపుకు తలలోకి ప్రవహిస్తుందికదూ—” అన్నాడు.

“అవునండీ !”

“అయితే క్రమంగా నిలబడియున్నప్పుడు పాదాలలోకి రక్తం ప్రవహించనందుకు కారణం చెప్పగలవా !”

“ఎందుకంటే మీపాదాలు బోలువికాకపోబట్టి.”



# శారద



శ్రీ వై. వి. శర్మ

"తాయం పెడ్తావా? లేదా? పెట్టక పోతే నీ జత ఉండను" అన్నాడు సుబ్బా రావు.

"ఇప్పుడు పెడ్తే జత ఉంటానంటావా? పెట్టకపోతే పచ్చికొట్టేస్తావేం!" అంది శారద

"అబ్బే శారదా! ఎప్పుడూ నీజతే ... వాళ్ల శేషు నిన్ను కొట్టడానికొస్తే నీ పక్షం ఉంటాను; మనిద్దరంకలసి శేషును కొడ్దాం. మరి నాకు కొంచెం పెట్టు" అని బావ సుబ్బారావు, మరదలుశారదను బుజ్జగించాడు. గంటక్రితమే, బావ తనను మొట్టికాయ వేశాడు; అందుకని కోపగించింది శారద; కాని బావ నవ్వుతూ మాట్లాడేటప్పటికి, ఆ నవ్వులో యేముందోగాని, శారదహృదయం వెంటనే మారిపోయింది. కోపంఉన్న మనిషిని చిటికెలో నవ్విస్తాడు బావ. ఎప్పుడూ అల్లరే! బావతో మాట్లాడకూడదనుకుంది. కాని మాట్లాడ లేకుండా ఉండలేకపోయింది. తాయం కొంచెం పెట్టింది. "మరి.. మరే...ఇంకా కొంచెం పెట్టు. నీకు మాంచి కథచెప్తా" అన్నాడు.

"అబ్బా! అంతా తీసేసుకుందామనా నీ ఆశ...అమ్మదొంగో!" అంది శారద "అయితే పోన్లే..." అంటూ బుంగ మూతి పెట్టాడు సుబ్బారావు.

"ఓ అమ్మాయి నెత్తిమీద గోరింకో" అంటూ హేళన చెయ్యటం మొదలెట్టాడు. శారదకు కోపంవచ్చింది. "వెధవ!" అని తిట్టింది. సుబ్బారావు రెండు మొట్టికాయలు వేశాడు. శారద ఏడుస్తూ అమ్మదగ్గరకు పోయింది.

• • •

కళ్ళవెంబడి నీరు కారుతూనే ఉంది. ఒక్కసారి ఉలిక్కిపడి లేచింది. ఎక్కడుంది తను? ఏమిటి ఆలోచిస్తూంది? షుమారు పది సంవత్సరాలక్రిందట జరిగిన సంఘటన, తన ఆలోచనాపథంలో నిలబడింది. ఎడ తెగని ఆలోచన; ఆధారంలేని ఆలోచన; విషాదాంతపు చ్ఛాయల్లో నడచిన తన జీవితానికి నాంది యేమో ఆసంఘట నని పిస్తుంది. తన జీవితం విషాదాంతం కావటానికి కారణం ఎవరు? ఆలోచిస్తూంది. తన గతజీవితపు సంఘటనలను ప్రస్తుత పరిస్థితులలో సమన్వయింప చెయ్యాలని ఆమె ఉబలాటం; బాధపడటమే తనకొక ఆభరణంగా అమరింది; పమిటతో కళ్ళ వెంబడికారే నీళ్ళను తుడుచుకుంది; మళ్లీ ఆలోచిస్తూంది... బావ ఇప్పుడు తనమాట వింటాడా? తనను జ్ఞాపకం ఉంచుకొనవలసిన అవసరం యేముంటుంది? అయినా బావ ఇంకా వివాహం చేసుకోక పోయేందుకు కారణం యేమిటో...తానసుభ

విన్తున్న యీ విచిత్ర కథాగమనం బావకు తెలియజేస్తే!.. తన నర్థంచేసుకునే మనస్తత్వం ఉంటుందా బావకు? ఒకవేళ అర్థంచేసుకున్నా, తనని ఆదరిస్తాడని నమ్మకమేమిటి? ..యేమిటో! ఆలోచిస్తూంది.... "ఒకసారి బయలుదేరి రావాలని వ్రాస్తే" హడలిపోయింది. మనస్సులో యెక్కడో లేనిపోని ఆందోళనకలిగింది. ఎక్కడ బావ? ఎక్కడ తను?

తన ముఖాన్నున్న కుంకుమ చెరిగిపోయిందే-చెరుపుకోవాలని చెరుపుకున్నది కాదది; విధాత విధించిన విధే! శారద ఇప్పుడు నిండుజవ్వని; జీవిత ఆనందపు ఘడియల్లో ప్రవేశించే సమయానికే, తన ఆనందానికి విఘాతం కల్గింది .. ఆశాసౌధాల్లో విహరిద్దామనుకున్న వేళనే, నిరాశామేఘాలు క్రమ్ముకున్నాయి; శారద భర్తపోయి రెండు సంవత్సరాలు కావస్తూంది; తాను ఆశించిన ఆశయాలన్నీ అంతరించి పోయాయి; తను చిన్నతనం నుండి ప్రేమించిన బావను వివాహం చేసుకునే స్వాతంత్ర్యమేనా లేకపోయింది; పోనీ బావను మరచిపోయి, తన నూత్నజీవితంల్లో మధువసంతాన్ని తిలకిద్దామనుకున్నా, వీలులేకపోయింది; మళ్ళీ ఇప్పుడు బావనుగురించి తలుచుకుంటే అపరాధం క్రింద జమకట్టబడుతుందేమో .. కాని ఒక్కవిషయం-బావ విశాలహృదయంల్లో తనకింకా స్థానముంటుందని నమ్మకంఉంది. బావ తనూ వీధివెంబడి వెడ్తూంటే యెంతో ముచ్చట పడ్తూండేవారు... అప్పుడు తను పొందిన అనుభూతి!... తలచుకున్నా లాభంలేదు; తలుచుకుంటేనే తప్పు!...అసలు బావకిచ్చి పెళ్ళి చెయ్యడం, అమ్మకూ నాన్నకూ సుతరామూ యిష్టం లేదు; . ఆఖరుసారి బావయింటికి వచ్చినప్పుడు తననుగురించి అమ్మతో నాన్నతో ఎంతవాదంపడలేదూ. అదృశ్యం యింకా తన కళ్ళముందు కనపడుతూన్నట్టుగానే ఉంది.

"అత్తయ్యా దూరం ఆలోచించు; చిన్నతనంనుండీ శారద నేను అరమరికలేకుండా ఎలా పెరిగామో నీకు తెలియనిది కాదు. ఎవడో నాకంటే ఎక్కువ ఆస్థిపరుడని, అందంగా ఉన్నాడని చెయ్యడం ఏం భావ్యంగాలేదు;...అప్పుడే నువ్వొక విషయం ఆలోచించాలి; నీకు కావలసింది పిల్ల సుఖంగా, ఆనందంగా జీవించాలనేనా... నేను ఒక సంవత్సరంల్లో బియ్యేపూర్తి చేసేస్తాను. ఏదో ఒక గవర్నమెంటు నౌకరీ సంపాదించలేకపోను ..బాగా ఆలోచించు.."అంటూ బావ హెచ్చరిస్తూంటే, అమ్మా, నాన్నా యేం మాట్లాడలేకపోయారు; ఏవో లేనిపోని కారణాలను మనస్సులో ఉంచుకుని, పిల్ల సౌఖ్యమైనా లెక్కచెయ్యకుండా, నడచిన తన తల్లి

దండ్రులను ఏమని "ఛార్జిషీటు" చెయ్యాలో తన కర్థంకావంటల్లేదు; వెళ్ళిపోతూ తనలో అన్నాడు, "బావ నిండు హృదయంలో ఎప్పుడూ నీకు స్థానం ఉంటుంది శారదా! ఎప్పుడు ఏ కష్టాలలో ఉన్నా ఒక ఉత్తరం వ్రాయి; తప్పక నా చేతనైన సాయంచేస్తా." అప్పుడు తను బావమాటకు అడ్డువచ్చింది, "మరి, నువ్వుగూడా పెళ్లి చేసుకుని..." అని అంటూంటే, బాధతో అభినయాన్ని చూపుతున్న కళ్లతో చూస్తూ అన్నాడు "శారదా! ఆ మాట తలపెట్టకు; ఇంత వరకూ జరిగినజీవితం మధువసంతం; శేష జీవితపు పంథాముళ్ళపొద." అని అన్నప్పుడు తను ఎంతగానో యేడ్చింది.. ఇవన్నీ తల్చుకొంటూంటే...ఎంతో బాధ తనకు! ఇలా అర్థంల్లేని ఆలోచన్లతో ఎన్నో రాత్రుల్లూ, పగళ్లూ గడచిపోయాయి.

◆ ◆ ◆

ఒకానొక రోజున ఒక నిర్ధారణకొచ్చింది. భావకు ఉత్తరం వ్రాయాలని నిశ్చయించింది. కలం, కాగితంతో జత పరచి అక్షరాలువ్రాయటం మొదలెట్టింది. ఏమని వ్రాస్తోంది తను! — తవని వివాహం చేసుకోమని...అపచారమేమో! అసలా విషయమే పట్టించదలుచుకోలేదు. తన జీవితాన్ని సర్వవిధాలా నాశనం చేసిన తల్లిదండ్రులను లెఖ్ఖచెయ్య దలుచుకోలేదు ... విధవావివాహం ... సంఘుంల్లో తప్పుబట్టరు - నయమే. ఈ సమాజాన్ని చీకటి కొట్టులోంచి, వెలుతురికి తీసుకుని వచ్చిన సంస్కర్తలు, మహాత్ములు రామమోహన్ రాయ్, వీరేశలింగంపంతుల్లకు మనసారా అంజలి ఘటించింది...ఉత్తరం పూర్తిచేసింది; దృఢనిశ్చయంతో, ద్విగుణీకృతోత్సాహంతో జవాబుకై ఎదురు చూస్తోంది!

అనుకున్నట్లుగానే బావదగ్గర్నుండి జవాబువచ్చింది-చదువుతూంది, "శారదా నీ యీ హ్రస్వ జీవితకాలంలో ఎన్ని పరిణామాలొచ్చాయో! ఎన్ని అనుభవాలు పొందావో! నీ హృదయంలోని ఆవేదనను, నా ఆవేదనతో సరిపోల్చుకున్నా; అర్థమయింది నీ ఉద్దేశం - నీ పరితాపం; రెండు రోజుల్లో బయలుదేరి వస్తూన్నా...నీ అబలత్వాన్ని వెనక్కునెట్టి సంస్కరణతో ముందుకు వచ్చిన నీకు నా ధన్యవాదాలు .. తప్పక మన వివాహం జరుగుతుంది; ప్రశాంతమయిన మనస్సుతో ఉండు...శెలవు." ఎంత నిండు హృదయం బావది! బావ సహృదయపూర్వకంగా ఆహ్వానించేందుకు! ఆనందంతో, ఉత్సాహంతో,...తన్ను ప్రతిఘటిస్తూన్న శక్తులన్నిటినీ ఎదిరించి, ప్రగతిమార్గాన్నన్వేషించాలని, విజయచిహ్నంగా నవ్వుతూ, రెండడుగులు ముందుకు వేసింది శారద.

——(o)——

# ముసి ముసి నవ్వులు

'వారపీచు'

"ఈ అగ్ని ప్రమాదము రాబడిపన్ను కార్యాలయంలో సంభవించిందా!"

"అవును. కాని అది ఎట్టి మహోపకారముచేయకముందే అగ్నిమాపకదళాలు వచ్చి ప్రమాదమును నివారించినవి."

♦ ♦ ♦ ♦

ఒక వకీలు, వైద్యుడు, శిల్పి, కమ్యూనిస్టు అంతరూ కలసి కూర్చొని భోజనం చేస్తూ ప్రపంచములో ఎవరివృత్తి ప్రథమంలో అమలులోనికి వచ్చిందన్నదానిని తర్కించుకొంటున్నారు.

వకీలు "తప్పకుండా వకీలు వృత్తియే ప్రథమంలో అమలులోనికి వచ్చియుండాలి; ఎందుకంటే తమను పాలించడానికి చట్టాలే లేకున్నచో మానవుడు బ్రతుక కలిగేవాడు కాడు" అన్నాడు.

"పొరబాటు – వైద్యశాస్త్ర మనేదే లేకపోతే మానవుడసలు లాగ పుట్టియుండేవాడు" అన్నాడు వైద్యుడు.

"వీరందరికంటెముందు అన్నిరంగాలలో మానవజీవితాన్ని అరాజకాన్నుండి తప్పించి సక్రమమార్గాలలో నడుపకల్గడానికి శిల్పియుండి యుండాలి" అన్నాడు శిల్పి.

కమ్యూనిస్టు నవ్వుతూ "అరాజకానికి కారకు లెవరై యుండియుంటారో" అన్నాడు.

♦ ♦ ♦ ♦

బహిరంగ ప్రదేశాలలో చనిపోయి పడియున్న జంతుకళేబరాలను లాక్కొనిపోయేవాడు చచ్చిపోయి పడియున్న గాడిదను చూచి వెళ్ళి ఆ విషయాన్ని పోలీసు అధికారికి తెలియజేసి "ఏమి చెయ్యమంటారు" అని అడిగాడు.

"ఏం చేస్తావు! – లాగుకొనివెళి పూడ్చిపెట్టేసెయ్యి – నీదేకదా ఆ పని"

"అవును–కానీండి, దాని చావును గురించి దానిబంధువులకు మొదట తెలియజేయడం ధర్మమని తలచి యిలా వచ్చాను."

♦ ♦ ♦ ♦

ఒక కళాశాలలో అధ్యాపకుడు పరీక్షలకుముందు తన ఉపన్యాసములను ముగిస్తూ "మీరంతా బాగా చదివి వ్రాయండి. మీకు కాలం బహుపరిమితంగా

నున్నది - ప్రశ్నాపత్రాలు ముద్రణ కీయబడియున్నవి. మీకేదైనా సందేహ నివర్తి కావలసియున్నదా'' అని అడిగాడు.

కొద్దిసేపు నిశ్శబ్దంగానుండి విద్యార్థులలో నొకడు "ఏముద్రణాలయంలో ముద్రణ కివ్వబడినవండీ'' అన్నాడు వెనుకనుండి.

♦ ♦ ♦ ♦

"ఎందుకోగాని మీ పెత్తల్లి మరణానికి యింత విచారపోతున్నావు! - నీ వెప్పుడూ యింతకుముందు ఆమెపట్ల యింత మమకారం చూపవాడివి కావే!''

"నిజమే-ఆమె చాలకాలం పిచ్చాసుపత్రిలోనుండి మమ్ముల్ని వేధించుకొని తిన్నది. కాని ఆమె తన ఆస్తినంతా నాకు సంక్రమించేలాగున వీలునామా వ్రాసింది. అది వ్రాసేనాటికి ఆమె మనస్థిమితానికి ఏమీ లోటులేదని రుజువుచేయడ మెలాగా అనేదే యీ విచారానికి కారణం.''

# శ్రీ గెడా గెరటయ్య హైస్కూలు నూతన భవన ప్రవేశ మహోత్సవము

పోలవరంతాలూకాలో కొయ్యలగూడెంలో శ్రీ గెడాగెరటయ్య హైస్కూలు నూతన భవన ప్రవేశ మహోత్సవమును యీ నెల 7 వ తేదీన ఆంధ్ర ప్రభుత్వ విద్యాశాఖామాత్యులు శ్రీ యస్. బి. పి. పట్టాభిరామారావుగారు జరిపారు. ఈ సందర్భమున జరిగిన సమావేశానికి దివాన్‌బహదూరు బండి శ్రీ హరిరావు నాయుడుగారు అధ్యక్షత వహించారు. గోదావరిజిల్లా కలెక్టరు, జిల్లా విద్యాశాఖాధికారి మొదలగు ప్రభుత్వోద్యోగులు, అనేక ప్రముఖులు సమావేశంలో పాల్గొనిరి. శ్రీ శ్రీ హరిరావునాయుడు గారి కృషి ఫలితంగా కొయ్యలగూడెం వాస్తవ్యులు శ్రీ కొల్లూరు విశ్వేశ్వరావుగారు భవన నిర్మాణము నకు 6 యకరములభూమి, శ్రీమతి కానుమల్లి వెంకట నరసమ్మగారు 15 వేల రూపాయలు, కేంద్రప్రభుత్వ ప్లానింగ్ కమిషన్ మెంబరు శ్రీమతి దుర్గాబాయ్ దేష్‌ముఖ్ గారిద్వారా కేంద్ర ప్రభుత్వము నుండి రు.10000 లు, దొమ్మేరు శ్రీ పి. వి. ఆర్. కె. రంగా రావుగారు 5 వేల రూపాయలు, పరిసరప్రాంతాలలో కొంత ధనము సేకరించబడింది. ఈ విషయాలను అధ్యక్షపీఠాన్నుండి వివరిస్తూయీ హైస్కూలు భవన నిర్మాణసందర్భమున దీక్షాకంకణుడైన శ్రీ జొన్నల గడ్డ వీరన్నగారి కృషిని శ్రీ నాయుడుగారు ప్రశం సించారు.

శ్రీ పట్టాభిరామారావుగారు ఉపన్యసిస్తూ యీ హైస్కూలు నిర్మాణంపట్ల శ్రీ శ్రీ హరిరావు నాయుడుగారు చూపిన శ్రద్ధాసక్తులను, శ్రీమతి కానుమల్లి వెంకటనరసమ్మగారి ఔదార్యాన్నిగురించి ప్రశంసించి ఆంధ్రదేశంలో పలుచోట్ల విద్యాలయ ములు మూయబడుచున్నను ఏజన్సీప్రాంత్యపు అభి వృద్ధి అభ్యుదయాల నుద్దేశించి ప్రభుత్వము దీనిని ఆమోదించుచున్నదనిరి. పరిశిష్ట మద్రాసు రాష్ట్ర ములో 51% స్కూలుఫైనలు విద్యార్థులుత్తీర్ణులైతే ఆంధ్రదేశంలో 30% ఉత్తీర్ణులగుటను ప్రస్తావిస్తూ తల్లిదండ్రులు శ్రద్ధాసక్తులు కలిగియుండాలనియు, డిటెన్షన్ విధానమును రద్దుచేసినంత మాత్రమున ప్రయోజనముండదని సెలవిచ్చారు. పోలవరంతాలూకా వెనుకబడియున్న పరిస్థితుల దృష్ట్యా ప్రత్యేకశ్రద్ధతో మేము బందకట్టు స్కీమును పంచవర్ష ప్రణాళికలో చేర్పించుటకు శ్రద్ధతీసికున్నామని శలవిచ్చిరి.

గ్రామప్రజల తరఫున, అధికార, అనధికార సభ్యుల తరఫున శ్రీ వడ్డూరి అచ్యుత రామారావు గారు పద్యరూపకమై సన్మానపత్రంలో శ్రీ శ్రీ హరి రావునాయుడుగారి అద్వితీయమైన కార్యదీక్షను, శ్రీమతి కానుమల్లి వెంకటనరసమ్మబోటి దాతల ఔదార్యమును, వారి జీవితచరిత్రలసమీక్షిస్తూ 60,70 వేల రూపాయలు విరాళము లెచ్చటెచ్చట ఏవిధంగా యిచ్చినది వివరించిరి. శ్రీ అచ్యుత రామారావుగారి వందనసమర్పణతోను, జనగణమన జాతీయగీతంతోను, అతిథి సత్కారంతోను, బీదలకు సంతర్పణతోను మహోత్సవ కార్యక్రమము ముగింపుకువచ్చింది.

---

## అమర్‌నాథ్ బాలవిహార్

భారతనారీమణులారా!

నేటిబిడ్డలు రేపుపాలకులు. మన దేశంలో పుట్టిన మహనీయులందరు మాతృమూర్తి ఉగ్గుబాల, సుశిక్ష ణతో మహోన్నత స్థాయికి వచ్చిన విషయం గర్వకారణము.

త్వరలో మద్రాసు మెరినాబీచియందు నెలకొల్ప బోవు అమర్‌నాథ్ బాలవిహార్ యొక్క ఆశయము - మీబిడ్డలను ఆరోగ్యవంతులుగా, ఉన్నతఆశయులుగా, మంచి విజ్ఞానవంతులుగా, వక్తలుగా, మేధావంతు లుగా తయారు చేయుడం. చిన్నబిడ్డలయందు అంతర్గ ర్భితముగా నుండిన జ్ఞానాన్ని ప్రజ్వలింపజేయుట మన విధి. ప్రతిజీవియందును దైవత్వము అంతర్గర్భితముగా నున్నది. దానిని బహిర్గతమొనర్చుటయే జీవిత పరమా వధి. ఈ కృషిలో వ్యక్తిగతంగా కల ఆటంకాలను తొలగించి బాలల పురోభివృద్ధికి తోడ్పడడానికి ఈ బాలవిహార్ నెలకొల్ప బడుతున్నది. మీ అందరి ఆసక్తి, సహాయసహకారములతో 'అమర్‌నాథ్ బాల విహార్' వర్ధిల్లుగాక!

---




**శ్రీరామానందలహరి : రత్నాకర బాలరాజు. ప్రకాశకులు సి. యస్. రామస్వామి, ప్లీడర్, అనంతపురం. వెల 0-8-0.**

ఆదికవి వాల్మీకి మొదలుకొని భక్తశిఖామణులు త్యాగరాజు, కబీరు, రామదాసాదులు రామనామ స్మరణామృతపానమును రక్తిముక్తిదాయకంగానమ్మి యావత్ప్రపంచానికి మార్గదర్శకులైనారు. శ్రీ బాలరాజుగారుకూడ శ్రీరామసంకీర్తన కవితావస్తువుగా గ్రహించి భక్తిరసము తొణికిసలాడుతూ మృదుమధుర శైలిలో నీ పద్యకావ్యమును రచించారు. కవిగారు భక్తిపారవశ్యంతో రచించిన యీ కావ్యంలో నచ్చటచ్చట ఉపనిషత్తుల సయితం జ్ఞప్తికితెస్తూ భావపూరితంగానున్నది.

**బాలనీతిశతకము : వాకాటి పెంచలరెడ్డి; ప్రకాశకులు : ఎ. యల్. రెడ్డి & కో., బుచ్చిరెడ్డిపాళెం, నెల్లూరుజిల్లా. వెల 0-5-0**

శతకవాఙ్మయము సంఘములో నైతికపురోభివృద్ధికి విశేషంగా నుపకరించి, అందులోను బాలలకని ఉద్దేశించి రచింపబడిన శతకములందలి పద్యములు వారి జీవిత పురోభివృద్ధికి నలుముఖాల తోడ్పడుచున్నవి. అట్టిదే యీ బాలనీతి శతకంకూడాను. ఇందలి పద్యములు భావపూరితములై చిన్న చిన్న పదములతో సులభశైలిలో అనర్గళముగా నడిచినవి. ఇందలి భావములు స్పష్టములై, నిర్దుష్టముగా బాలలకు నీతిబోధకముగానున్నవి.

**మనరామకృష్ణుడు, మనశారదామాయి, మన వివేకానందుడు : శ్రీ శ్రీ మాతాజీ. ప్రకాశకులు : శ్రీ అనుభవానంద గ్రంథమాల, భీమునిపట్టణము, బ్రాంచి-బాపట్ల. ప్రతి 1-కి 0-8-0.**

ఈ మూడు పుస్తకములు భారత ప్రజానీకానికి ముఖ్యంగా సర్వమానవ సౌభ్రాతృత్వ సందేశాన్ని పూరించి ఆధ్యాత్మిక ఆదర్శాలతో మానవజీవయాత్ర సుగమంగా కావించిన శ్రీరామకృష్ణ పరమహంస యొక్కయు, వారి సతీమణి శ్రీ శారదామాయి యొక్కయు, శిష్యుడు శ్రీ వివేకానందస్వామి జీవితగాథలు గలవి. శ్రీ మాతాజీ వీనిని సరళమైనశైలిలో రచించి మహోపయుక్తంగాచేశారు.

మొదటి రెండు గ్రంథములలో శ్రీరామకృష్ణ పరమహంసయొక్కయు, శ్రీ శారదామాయియొక్క జీవిత విశేషాలు, బోధనలు దైనిక జీవితంలో ఆధ్యాత్మిక చింత ప్రాముఖ్యతను, ఆవశ్యకతను పురుషులకు, స్త్రీలకు ప్రబోధిస్తూ, వారి జీవితాలను ఉత్తమ లక్ష్య, ఆశయాలతో రూపొందించుకొనడానికి దోహదం చేస్తున్నవి.

శ్రీ వివేకానందుడు శ్రీరామకృష్ణ భగవానుని శిష్యుడై మన జాతీయాధ్యాత్మిక వేదాంత విషయాలను ఖండాంతరాలలో విశేషంగా ప్రచారంచేసి మనదేశకీర్తి ప్రతిష్ఠలను యినుమడింపజేసిన జీవిత విశేషాలను మూడవ గ్రంథమున చక్కగా వివరించబడింది.

ఈ మూడు గ్రంథాల పఠనం ప్రతియొక్కరిలో ఆత్మవిశ్వాసాన్ని పురికొల్పుతూ, భారతజాతీయ విశిష్టతను ప్రబోధిస్తుండగలదని మా విశ్వాసం.

# సంపాదకీయములు

## ఈ సంచిక

'గృహలక్ష్మి'కి చెమ్మగిలిన నేత్రాలు యింకా ఆరనైనా ఆరకముందే పూజ్యబాబు కేసరిగారు పరమపదించి సంవత్సరకాలమయింది. వారిపట్ల భక్తివిశ్వాసాలతో, ప్రేమానురాగాలతో యీ సంచికను స్మారక చిహ్నముగా మీ కందిస్తున్నాము.

పూజ్యబాబు అనురాగవాత్సల్యాలు, శ్రద్ధాసక్తులు గృహలక్ష్మికి కరువై మీబోటి సోదరసోదరీమణుల ఆదరాభిమానములతోను, పెద్దల ఆశీస్సులతోను మీ నలుగురిలో ఆడుతూ, పాడుతూ తిరుగాడుచున్నది. శ్రీ కేసరిగారి ఆదర్శలక్ష్యాలు ప్రాతిపదికనైనా రానున్న కాలంలో సయితం మహిళాపురోభివృద్ధికి, మహిళా ఉద్యమవ్యాప్తికి యితోధికంగా తోడ్పడడమే మా గృహలక్ష్మి యుద్దేశం.

పూజ్యబాబు ప్రథమ మృతివార్షికవర్ధంతి సందర్భమున పరోపకారి, ప్రజాహితుడు, ఆదర్శనీయుడునైన వారిని సంస్మరించడానికి యీ స్మారకసంచిక అవకాశమీయగలదని మా విశ్వాసం.

ఏటేటా స్వర్ణకంకణ ప్రదానం ఎప్పటియట్లు జరగడానికి శ్రీ కేసరిగారు రు. 5000 లు నిధిని ఏర్పరచియున్నారు. దానిపై వచ్చు రాబడిని వినియోగించి ఎప్పటియట్లు ఇకముందును కంకణప్రదానము జరుగగలదు. వారి నిర్యాణ కారణముగ యీ ఏడాది మాత్రము కంకణప్రదానము, గృహలక్ష్మి జయంతి నిలిపినారము.

ఈ సమయంలో యీ స్మారకసంచిక నందుకుంటూ మాతోబాటు మీరు శ్రీ కేసరిగారిపట్ల భక్తి విశ్వాసాలను ప్రకటించడం సహజం. ప్రపంచకళ్యాణాన్ని, మహిళాభ్యుదయాన్ని ఉద్దేశించి వారు స్థాపించి జీవితాంతమువరకు నిర్వహిస్తూవచ్చిన 'గృహలక్ష్మి'కి మీయొక్క ఆదరాభిమానములు, సహకారసద్భావములు మరింతగా లభ్యములు కాగలప్పుడు గృహలక్ష్మి మరింత ఆకర్షణీయంగా, ప్రజోపయుక్తంగా విరాజిల్లగలదనునది నిర్వివాదాంశము.

## సహకారోద్యమ స్వర్ణోత్సవం

ఈ మహోత్సవమును ఆంధ్రదేశమంతటా ఉత్సాహాతిశయాలతో జరుపబడింది.

ప్రతి పరిశ్రమ జాతీయంచేయాలని ఆందోళనజరిగే యీరోజులలో అది అంత సులభసాధ్యంకానప్పుడు, దానికి ప్రత్యామ్నాయంగా సహకారపద్ధతులలో యించుమించుగా అన్ని పరిశ్రమలను స్థాపించుకొని నిర్వహించుకొని ప్రజలు తమ ఆర్థికవ్యవస్థను చక్కబరచుకొనవచ్చును.

ముఖ్యంగా వ్యవసాయంలో 1,2 యకరాలు భూమిగలరైతులకు సాగు చేసికొనుటకు గల వివిధ అవకాశములు లోపభూయిష్టములు. అందువలన వారు పడేబాధలు, యిబ్బందులు అనేకములు. వీనినధిగమించి తాము అందరితోబాటు పురోభివృద్ధిగాంచాలంటే సన్నకారురైతులు సహకార సంఘాలను స్థాపించుకొని తమ భూములను సాగుజేసుకొనుటకు వలయు ప్రభుత్వసహకార, సహాయములను, వసతులను పొందడం మంచిది.

## శ్రీ జయనామ సం॥ర జ్యేష్ఠ-ఆషాఢమాసములు

| | | | |
|---|---|---|---|
| 1954 సం॥ జూన్ నెల | 16 | బు | ○ పౌ 26.41 జ్యే 20.6 రా 9.14 |
| | 17 | గు | బహుళపాడ్యమి 18.46 మూ 23.56 దివ 19.40 |
| | 18 | శు | విదియ 29 44 పూషా 26.42 రా 15 24 |
| | 19 | శ | త 29 30 ఉషా 28.19 రా 6.10 |
| | 20 | ఆ | చ 28 1 శ్ర 28.40 రా 6 19 సంకటహరచతుర్థి |
| | 21 | సో | పం 25.18 ధ 27.49 రా 13.1 పంచమీతిథిః |
| | 22 | మం | ష 21.27 శ 25 51 రా 8.51 తిథిద్వయం |
| | 23 | బు | స 16.36 పూభా 22.52 రా 13.34 |
| | 24 | [illegible] | అ 11 0 ఉభా 19.10 రా 14.53 త్యా 3.43 |
| | [illegible] | శు | న 4.47 ఏస్యం 53.27 రే 14.54 |
| | 26 | శ | ఏ 51.3 అశ్వ 10.21 ది 1.5 స్మార్తైకాదశి |
| | 27 | ఆ | ద్వా 45.7 భ 5.47 రా 1.30 మాధ్వవైష్ణవమేకాదశి |
| | 28 | సో | త్రి 39.9 కృ 1 9 రో 56-2 రా 6.32 |
| | 29 | మం | చతు 33 56 మృ 54.33 ది 10.4 |
| | 30 | బు | ● అమా 29.36 ఆర్ద్రా 51.33 ది 14.44 తిరువళ్ళూరు వీరరాఘవస్వామినాం [తెప్పోత్సవః |

### ఆషాఢమాసము

| | | | |
|---|---|---|---|
| 1954 సం॥ జూలై నెల | 1 | గు | శుద్ధపాడ్యమి 26.22 పున 41.51 ది 22 2 |
| | 2 | శు | విదియ 24.71 పుష్య 52 1 ది 11.41 |
| | 3 | శ | తదియ 2?.27 ఆశ్లే 53.34 ది 24.46 తృతీయాతిథిః |
| | 4 | ఆ | చ 23.51 మ 56.19 దివ 24.51 చతుర్థతిథిః |
| | 5 | సో | పం 25 23 పూఫ 60.10 ది 17-28 పంచమితిథిః |
| | 6 | మం | ష 27.58 పూఫ 0.19 ది 19.47 త్యా 4.19 |
| | 7 | బు | స 31.22 ఉఫ 5.3 దివ 27.57 |
| | 8 | గు | అ 35.24 హ 10-26 రా 0.22 త్యా 4.24 |
| | 9 | శు | న 39.53 చి 16 21 ది 31.46 |
| | 10 | శ | ద 44 17 స్వా 21.17 రా 5.38 |
| | 11 | ఆ | ఏ 48.36 విశా 28.13 రా 7.6 సర్వేషాం ఏకాదశి |
| | 12 | సో | ద్వా 52 25 అనూ 33.45 రా 16.5 |
| | 13 | మం | త్రి 55.25 జ్యే 36.34 రా 27.58 |
| | 14 | బు | చతు 57.43 మూ 42.44 రా 6 25 |
| | 15 | గు | ○ పౌ 58.47 పూషా 45.46 ది 7.50 |

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press, Kesari Kuteeram Ltd.
15, Westcott Road, Royapettah, Madras.
Founder-Editor : Dr. K. N. Kesari; Ag. Editor : C. C. Punniah.